# ఈ నాటకమున వచ్చు పాత్రములు

## పురుషులు

| | | |
|---|---|---|
| దేవేంద్రుఁడు | లోహితాస్యుఁడు | |
| వసిష్ఠుఁడు | పింగళుఁడు | పౌరులు |
| విశ్వామిత్రుఁడు | రోహణకుఁడు | పౌరులు |
| నారదుఁడు | రైభ్యుఁడు | |
| బృహస్పతి | భేతాళుఁడు | |
| అగస్త్యుఁడు | కాలకౌశికుఁడు | |
| గౌతముఁడు | కేశవుఁడు | |
| హరిశ్చంద్రుఁడు | జనార్దనుఁడు | |
| సత్యకీర్తి | వీరబాహుఁడు | |
| నక్షత్రకుఁడు | పరమేశ్వరుఁడు | |

సూతుఁడు, సూత్రధారుఁడు, కంచుకి, వందిమాగధులు, భటులు, గొండలు వత్తురు.

## స్త్రీలు

చంద్రమతి, మాతంగకన్యలు. కాలకంటకి, పార్వతి

శ్రీరస్తు

# సత్యహరిశ్చంద్రీయము

## ప్రథమాంకము

### నాంది

మ. ననవిల్తుండు చలంబునన్ బయిఁబయి ♦ న్వ్రాతంగ కన్యావిలో
కన సమ్మోహనబాణ మేసినను న ♦ త్యుగ్రేశుఁ డామీఁదఁ జి
క్కని రేయెండల గుప్పుచున్నను, దదే ♦ కధ్యానవిన్యస్తచిం
తనమై మాఱగ రాజశేఖరు తపో♦నైశ్చల్య మేలున్ మమున్.

గీ. భువనకారణ మీశ్వరు ♦ మూర్తి యేది
ఆస్తికనిరూఢి కెయ్యది ♦ యాదిమూల
మఖిలధర్మంబులకు నేది ♦ యాటపట్టు
అట్టి సత్యంబె యందఱ ♦ నాశ్రయించు.

(నాంద్యంతమున)

సూత్రధారుఁడు—అహో! యేమి నాపుణ్యము! నిరంకుశనాటకాలంకారసాహిత్య రససరోనిమజ్జనసముజ్ఝితమనఃకలంకులగు నీపరిషజ్జను లేకాలంకులఁ జూచినవా రామద్యో నాటక భవన మలంకరించిరి. ఇంకను మారిషుఁడు ప్రవేశింప కున్నాఁడేమి?

మారి—(ప్రవేశించి) బావా! వచ్చితి (నలుదిక్కులఁ బరికించి) అయ్యా! యేదియో నాటక ప్రయత్నముగ నున్నది. రంగమంతయు యథావిధిగా నలంకరింపఁ బడియున్నది. అదియును గాక,

చ. అలకలు దిద్దువారు, జడ ♦ యల్లికలన్ విరజాదు లుంచువా
రలు, వదనమ్ములన్ గరగ ♦ రన్ జికిలీ యొనరించువారు, మై
గలప సులందువార, లవి ♦ గావివి యంచును మార్చిమార్చిభూ
షల నిడువారు నై గుజగు ♦ జన్ జనుచుండిరి సర్వసాంఘికుల్.

సూత్ర—ఏమోయి! నేఁ డుదయమునఁ జేసిన ప్రకటనము నీ వెఱుంగవా యేమి ?

మారి—ఏమని యాప్రకటనము ?

సూత్ర—ఏమనియా ? ఆంధ్రదేశమున చాలకాలము పేరు ప్రఖ్యాతి గాంచిన గుంటూరు హిందూ నాటకసమాజముచే మొన్న మొన్నటివఱకు పెక్కుసారులు ప్రయోగింపఁబడి నేఁడు సర్వజనాదరణీయమై యత్యంత నీతిదాయకమై యొప్పుచున్న "సత్యహరిశ్చంద్రీయ" నాటక మిచ్చట నీ రాత్రి ప్రదర్శింపఁబడునని;

మారి—ఇది మన లక్ష్మీకాంతకవి రచించినదేకద !

సూత్ర—అవును.

మ. సరవిన్ బుద్ధిమతీ విలాసము, హరి ♦ శ్చంద్రీయమున్ శ్రీసదు
త్తర రామాహ్వయ నాటకంబు నల స♦త్రాజిత్సుతోద్వాహమున్
స్థిరపుణ్యప్రదముల్ రచించె నతఁడే ♦ దృశ్యప్రబంధోరు వై
ఖరి నేల్మోడ్చి పురాతనాధునిక రం ♦ గత్సత్కవిశ్రేణికిన్.

(నేపథ్యమున)

మ. క్రతువు ల్పెక్కు లొనర్చినన్ నిరతమున్ ♦ గంగాదిపుణ్యాపగా
తతులన్ మున్గిన, గోశతంబులను స ♦ ద్ధాత్రీసురశ్రేణి క
ర్పితముల్ చేసినఁ జెందవచ్చునె బలా ♦ రీ! నిత్యసత్యవ్రత
స్థితుఁ డార్జించు సుపుణ్యకీర్తులను గొం ♦ చెంబేని నెవ్వానికిన్.

సూత్ర—(ఆకర్ణించి) ఆతఁడె నీ తోడియల్లుండు వసిష్ఠుఁడై వర్తించుచున్నాఁడు. మనము సముచితసంవిధానంబున వర్తింతము. [నిష్క్రమింతురు]

ఇది ప్రస్తావన.

## రంగము—సురసభ

[పిమ్మట వసిష్ఠ విశ్వామిత్ర నారదాదిమహర్షులతోడను, బృహస్పతితోడను దేవేంద్రుఁడు ప్రవేశించుచున్నాఁడు]

వసి—'క్రతువు ల్పెక్కు లొనర్చినన్' అను పూర్వోక్తపద్యము పఠించుచున్నాఁడు.
దేవేం—మునిజనవరిష్ఠా ! వసిష్ఠా ! సత్యవ్రతమునుగుఱించి చక్కఁగా వక్కాణించిరి.
వసి—దేవేంద్రా ! వేపలుక్కలేల ? సత్యంబు పరబ్రహ్మస్వరూపంబు గాన నద్దాన సకల ధర్మంబులు సకల సత్కర్మంబులు వెలయుచుండు. అద్దాని ప్రభావంబు ననే పరమేశ్వరుండు జంగమస్థావర విశిష్టంబులైన భువనంబుల సృష్టింపను బెంపను హరియింపను సమర్థుఁ డయ్యె. వెండియు వికల్పశూన్యం బైన యమ్మహామహుని సంకల్పం బదియే కాన,

శా. సత్యంబే సకలార్థ సాధక మగున్ ♦ సత్యస్థిరుం డొందు నౌ
న్నత్యంబెల్లెడలందు, సత్యమునక ♦ న్నన్ మిన్నయౌ ధర్మముల్
స్తుత్యంబుల్ మఱిలేవు, సత్య ♦ ము ఫలించున్ నాఁటికిన్ నేఁటికిన్
సత్యాలాపి యొకండె నిత్యుఁడు, ప్రపంచ♦స్థాయి సత్యం బగున్.

కావున సర్వదా సత్యనిష్ఠ యనుష్ఠేయంబు; సత్యవ్రతం బాచరణీయంబు. ఎట్టి కష్టకాలంబునందైన సత్యంబు విడువకుండిన నయ్యదియే కడకతని నుద్ధరించును.
బృహ—బాగు ! వసిష్ఠా ! బాగు !
అగస్త్యుఁడు—వసిష్ఠా ! ధర్మపథన్యాసం బైన నీ యుపన్యాసంబు సమంజసముగా నున్నది.
నార—మైత్రావరుణీ ! అతిమాత్రం బైన నీ వాఙ్మాధుర్యము శ్లాఘాపాత్రముగా నున్నది.
గౌతముఁడు—బ్రహ్మర్షిసత్తమా ! బ్రాహ్మణ్యుండవైన నీవు వచించిన దంతయు యథార్థము.
విశ్వా—(స్వగతము) ఛీ ! స్వర్గమునకు వచ్చినను నోడియేరులు దప్పలేదన్నట్లిక్కడను నాకు వసిష్ఠుఁడే దాపుర మయ్యెను. ఈతండు నోరు మెదలించిన మాత్రంబున నీజన్నిగట్టు దపసులెల్ల భట్టులచందంబున శ్లాఘించుచుందురు. నాహృదయమున కిప్పుడు చిచ్చు ముట్టించినట్లున్నది. ఏదో యొక కారణము కల్పించుకొని చీలి పోరాటము వెట్టికొని యాతనికి నేఁ తేజోభంగియైన ల్యాభ భంగము చేయక పోను.

నార—(స్వగతము) వసిష్ఠవిశ్వామిత్రు లిరువు రొక్కచో గూడియుండుటచే సభ నాకిప్పుడు కన్నులపండువుగా నున్నది. ఇక్కడ నిప్పుడు చక్కనికలహము లభింపవచ్చును. విశ్వామిత్రునికి కొంచెము పురిపెట్టి చూచెదను. (ప్రకాశముగా) విశ్వామిత్రా! ఈ వసిష్ఠుని యుపన్యాసంబు నీకేమియు రుచించినది కాదాయేమి? మాటాడ కూరకుంటివి?

విశ్వా—(అపహాస్యముగా) నిరర్థకమైన యాతని యుపన్యాసంబును మీరందఱు సంతసించితిరికదా! చాలు.

వసి—విశ్వామిత్రా! నాయుపన్యాసంబు నిరర్థకమా?

విశ్వా—ఆహా! ముమ్మాటికి నిరర్థకమే.

వసి—ఎందుచేత?

విశ్వా—ఎందుచేతనా? నోటికి వచ్చినట్లు పెక్కు ధర్మంబు లుపన్యసించవచ్చు. అయ్యది లోకములం దాచరణలోనికిఁ దేవలయు. ఆచరణమునకుం బనికి రాని నీధర్మశాస్త్రంబు లెందులకు? ఎల్లవారు సులభముగా నాచరణమునం దుంచుకొనుటకై సత్యవ్రతమునుగుఱించి శుక్రుఁడెట్లు చెప్పినాఁడో చూడు

వసి—ఎట్లు చెప్పినాఁడు?

విశ్వా—

ఆ. "వారిజాక్షులందు ♦ వైవాహికములందు
ప్రాణవిత్తమాన ♦ భంగమందు
చకితగోకులాగ్ర ♦ జన్మరక్షణమందు
బొంకవచ్చు నఘము ♦ పొందదధిప!" అని

ఇదియే సమంజసముగా నున్నది. ఎట్టి యిక్కట్టులందైన సత్యంబు విడువ గిట్టదని నీవొక్కఁడవు వక్కాణించినంతమాత్రంబున నొక్కండక్కరణిం బ్రవర్తించు వాఁడుండఁడు.

దేవేం—కుశికనందనా! నీ యుక్తి యుక్తియుక్తముగా లేదు. ఏలయన శుక్రుని ధర్మశాస్త్రమువలన నవసరము వచ్చినప్పుడెల్ల నబద్ధ మాడవచ్చునని తేలుచున్నది. ఒక్కసౌశీల్యాదిగుణములఁ బరీక్షింపవలసినసమయ మాతని యిక్కట్టులయందుగాని సౌఖ్యములయందుఁ గాదు. ఆపత్కాలంబునఁ జలింపని వాఁడే ధైర్యవంతుఁడు. ఎట్లన,

గీ. సరసులగు పండితుల విమ ♦ ర్శనము లెల్ల
గడచినదెకద నిర్దుష్ట ♦ కావ్యమగును;

విశ్వా—ఏమీ! మాకాపరాభవము! (హుంకరించుచున్నాఁడు) ఆతఁడు చెప్పిన దంతయు నబద్ధమని నే నిప్పుడు సిద్ధాంతము చేయుటకు సిద్ధముగా నే యున్నాఁడ, చెప్పనిమ్ము.

వసి—దేవేంద్రా! నీ వడిగిన ప్రశ్నకు నేను దైవసాక్షిగా నుత్తరం బిచ్చెద. మునీంద్రులారా! ఆకర్ణింపుఁడు. కలదు గదా, భూపతీ తిలకంబునకుఁ నిలకాయ మానంబగు నయోధ్యాపురవరంబు. అందు,

శా. చాతుర్వర్ణ్యవిధానముల్ నడుపుచున్ ♦ సత్యంబు, ధర్మం బహిం
సాతత్త్వాదిగుణంబులన్ బ్రజల యాచా ♦ రంబు, శాసించి, వి
ఖ్యాతశ్రీధర నేలువాఁ డఖిలదీ ♦ నానాథరక్షాదికృ
త్తాత్పర్యదయాతిసాంద్రుఁడు హరిశ్చం ♦ ద్రుఁడు నిస్తంద్రుఁడై.

ఆతం డొక్కఁడే త్రిభువనంబుల సత్యసంధుఁడు.

విశ్వా—(స్వగతము) ఈతఁడు మాసాటి రాచపట్టియగు త్రిశంకుపట్టిని సత్యమూర్తి యని వర్ణించుచుంట నాకుఁ గర్ణరసాయనముగా నే యున్నది గాని, యేది యెట్లున్నను నాకు గర్భశాత్రవుఁడగు నీవసిష్ఠుపక్షమును నేను పూర్వపక్షము చేయవలసినదే గాని యంగీకరింపరాదు. కావునఁ బోరాటంబున కిట్లుపక్రమించెదఁగాక (ప్రకాశము) వసిష్ఠా! నీ వెవ్వనినో సత్యమూర్తియని పేర్కొంటివి? మేము పరాకునఁ జక్కఁగా విననైతిమి. మరల నొక్కమాఱు పేర్కొనుము.

వసి—ఒక్కమాఱుగాదు, ముమ్మాఱు పేర్కొనినయెడ. హరిశ్చంద్రుఁడు, హరిశ్చంద్రుఁడు, హరిశ్చంద్రుఁడు.

విశ్వా—(కోపముతో) ఔరా! వసిష్ఠా!

సుగంధివృత్తము—రాగము—కీరవాణి, తాళము—రూపకము.

చాలుఁ గట్టిపెట్టు మీపిసాళిపల్కు రచ్చలో
ఖూళ! నెత్తురే? ధనంబు కోట్లు నీకు నిత్తురే?

వసి—ఏల హుంకరించె దిప్పు డేమి తప్పు వచ్చెరా!
కాలుఁ ద్రవ్వి కయ్యమాడఁగాఁ దలంచినాఁడవే?

విశ్వా—పోలనట్టి మాటలాడఁబోలునే? ఖుద్రాంధులా
ఆనఘుల్ నృపాధముల్ దురాత్మ! సత్యశోధులా?

వసి—క్రేలరీ ! త్రిశంకుపట్టి పృథ్వీరాజమాత్రుఁడా !
పాలిస ప్రసిద్ధ సత్యవాక్పవిత్రగాత్రుఁడే !

విశ్వా—వసిష్ఠా ! చాలు నీవాచాలత్వము. పాపాకరంబగు మర్త్యలోకంబున నుగ్గుబాలతోఁ దుష్కర్మంబులయం దాఱితేఱిన రాజకులమునం దొక్కఁడు సత్యసంధుఁడు గలఁడని సిద్ధాంతీకరించుచున్నావుగా? తరతరంబులనుండియు నతనియింటఁ బురోహితత్వంబుఁ జేయుచుఁ బొట్టబోసికొనుచున్నందుల కా హరిశ్చంద్రునిపై నీకీ యభిమానమా ! "విస్సన్న చెప్పినదే వేదము" అన్నట్లు నీవు చెప్పినదెల్లవా రంగీకరింతురను దురభిమానముచేఁ గాఁబోలు, కానిదానికై నందఱికంటె ముందుగాఁ గాలు దువ్వుచున్నాఁడవు. ఛీ! ఛీ! భూతభవిష్యద్వర్తమాన కథావిదులగు నిట్టి తపోధనులచేత నిండియుండిన యీ దేవసభామధ్యంబునఁ ద్రిలోకంబులఁ దన యఱచేతియం దిడుకొని సహస్ర నేత్రములచేతను సమస్త లోకవిషయములం గనిపెట్టుచు నన్నిటికి సాక్షిభూతుండైన యీ దేవేంద్రునితో నక్కఱకు మాలిన పెద్దఱికము పైన వేసికొని యిట్టి మృషాలాపములాడుట కిప్పుడు నీ మెడమీఁద కేమి కత్తి వచ్చినది ? ఎవ్వరికిం దెలియని యీ హరిశ్చంద్రుని సత్యసంధత నీ కొక్కనికి మాత్రమే తెలియుటకు నీమొగమున నే ప్రొద్దువొడిచినదేమి? హరిశ్చంద్రుఁడట ! సత్యసంధుఁడట ! తా నెఱుఁగునఁట ! సభ్యులారా ! వినుఁడీ. భ్రష్ఠా ! వసిష్ఠా !

మ. వడలున్ జక్కిలముల్ ఘృతంబు పెరుగుం ♦ బొల్మాంసఖండంబుల
ప్పడము ల్మెక్కుత్తుక బంటిగాఁ దిని సురా ♦ పానక్రియన్ మత్తులై
చెడి తబ్బిబ్బులఁ గూయు రాజులెచటో ♦ చింతింప స్వర్గంబెటో
జడుడా ! నీగగనప్రసూనకథలన్ ♦ జాలించి నోర్మూయుమా.

దేవేంద్రా ! మునీంద్రులారా ! ఈ దుష్టవసిష్ఠుండు హరిశ్చంద్రుండు సత్యసంధుఁడన కొంతము జించుకొనుచుఁ దన కల్ల పగ్గిలయం బ్రకటింపఁ గూనిన దురాలాపంబుల మీరు విశ్వసింపకుఁడు. లోకంబుల నిక్కువంపు సత్యశీలుం డెవఁడును లేఁడనుమాట నిస్సందేహము. నిర్ధారణము. నిశ్చయము. (కూర్చుండును)

నార—(స్వగతము) విశ్వామిత్రుఁడు బాగుగా రేఁగినాఁడు.

వసి—ఛీ ! విశ్వామిత్రా ! అపాత్రా !

మ. చెడుగా ! యింతను మానవైతివి పర ♦ శ్రేయోపహావ్యాహృతిన్
దుడుకుం బోకల నిన్నుఁబోలు దురితా ♦ త్ముం డ్లేన వేలాన్నృవున్

గను దూషించినఁ దద్యశోంకమునకున్ ♦ గానున్నదే నింద్యమౌ
సడి మత్తాళి త్యజించినన్ గొఱంతయే ♦ సంపెంగ నెత్తావికిన్.

ఓరీ ! దుర్మతీ ! ఇప్పటికి నీనైసర్గికదుస్స్వభావము మానినదికాదే ! ఆత్మస్తుతియుఁ బరనిందయు దుర్జనసులభంబు లని తెలిసియు నట్టి నీచగుణంబులనుండి నీచిత్తంబుఁ దొలఁగఁజేయలేక పెనఁగులాడుచున్న నీతకుంబేల, కొల్పనా? సభయం దార్యులడిగిన ప్రశ్నంబునకుఁ బ్రత్యుత్తరంబు తెలిసియు నుచితభక్తి నెఱుఁగఁజేయకున్న నరకప్రాప్తి కలుగునను ధర్మశాస్త్రవిధుల ననుసరించి, సకల లోకవిదితంబై సమస్త సురమునివర్ణనీయంబై యనన్యసామాన్యంబై విడంబించు నెవ్వాని నిత్యసత్యసౌశీల్యంబు ముజ్జగంబులకు నొజ్జబంతి యనఁదగునో, యట్టి సత్యకీర్తి హరిశ్చంద్రచక్రవర్తిం గుఱించి, యున్నవాస్తవమును నించుకయైన మిగిలి వర్ణింపక యీసభయందు నేను వక్కాణించుచుండ నిర్హేతుకంబుగా నేలఁ గయ్యంబునకుఁ గాలుఁద్రవ్వెదవు ? ఇచ్చటి సభాసదులెల్ల వీనులదోయిళ్ళం ద్రావు నాతని సత్యకథాసుధారసంబు నీకు నొక్కనికి మాత్రము విషప్రాయమయ్యెనేమి ? మూఢా ! ఊరక లేనిపోని పెత్తనములఁ బైవేసికొని, నేనును నొకఋషినే యనుకొనుచు మాయందఱలో దళసెత్తుకొని తిరుగఁగలిగిన నీకున్న యీకొంచెపుమర్యాద గూడ నేల చెడఁగొట్టుకొనియెదవు ? ఊరకుండుము.

విశ్వా—ఛీ ! పాపిష్ఠా ! వసిష్ఠా !

ఉ. ఒక్క నృపాధమాన్వయము ♦ మదోద్ధతుఁ బేర్కొని సత్యమూర్తియం
చిక్కడఁ బెద్దఁజేసి నుతి ♦ యించుచు, గాదనువారి నెల్ల మ
త్తెక్కిన మాటలాడుచు భ ♦ ళీ ! నిగసించెదవా ? వసిష్ఠ ! నీ
టక్కరికూఁత లానృపుక ♦ డన్ బ్రకటింపుము పొట్టనిండెడున్.

దురాత్మా ! అసంబద్ధప్రగల్భా ! నీచరాజాభిమానీ ! లోకాతీతవిషయంబుల నిశ్చయంబులని రాలు గ్రుద్దుచుఁ గాఱుఁగూతలు గూయుచున్న నీకు నేఁడు వాగ్బంధనము కావలసినదే. దుర్మతీ ! వాతాతపవర్షంబుల కోర్చి త్రిలోక భయంకరంబగు తపోనియతిచే ఫాలాక్షునంతవాని లోఁగొన్న నాతపంబు నేకొల్చునంతటి మహర్షివైతివిగా ! బ్రహ్మబంధుఁడా ! నాకుఁ గొంచెపుమర్యాదయేమి? దేవేంద్రుఁ డడిగినదే తడవుగా నిక్కడ నున్న మునిబృందారకు లందఱికంటె నగ్రేసరుండనైనట్లు ముందుగా బయలుదేఱి నీకున్న పురోహితత్వపు మర్యాదను బదుగురలోఁ బ్రకటించుకొన్న నీ తెలివికందఱు సంతసించినారులే. ఓరీ ! ఆత్మశ్లాఘపరాయణా ! [illegible] దేవేంద్రుఁడైనను నిక్కడివారి నందఱు నడిగెఁ గాన, నీ యొక్కనిమాత్రము

బొట్టును గాటుకయుఁ బెట్టి పేరంటమునకుఁ బిలిచెనా ? వీరందఱకుఁ దెలియని విషయము నీకు మాత్రమెట్లు దెలియునో ? చూడు.

సీ. బడబానలములోఁడఁ ♦ బాధోధు లొక్క గ్రు
క్కనఁ గొన్న ఘనుఁడీయగ ♦ స్త్యుకన్న
ముక్కంటి నెదిరించి ♦ ముంగాల సెగకన్నుఁ
బూనిన యీభృగు ♦ మౌనికన్న
కినిసి యీదేవేంద్రు ♦ శను వెల్ల వే గను
న్మలచిన యీగౌత ♦ మమునికన్న
సృష్టికిం బ్రతిసృష్టిఁ ♦ జేసి నీతల దన్ని
బ్రహ్మింభవించి సు ♦ ప్రథితుఁడైన
ఈకుశికనందనుని గన్న ♦ నెందు నీవు
పెద్దవో ముందుఁ జెప్పు మీ ♦ సుద్దులేల ?
వేల్పుఁ బేరోలగమున నై ♦ విఱిచికొనుచు
పద్దులాడఁగనే నీవు ♦ పెద్దవైతె ?

చాలు ! చాలు ! నోరుమూయుము. పాపము కంఠశోషఁబడి యఱచితిని. కొంచెము వాక్పరిశ్రాంతికై యింత కమండ లూదకమునైనఁ బుచ్చుకొనుము.

నార——(వసిష్ఠునితో రహస్యముగా) వసిష్ఠా ! అధికప్రసంగియైన యీవిశ్వామిత్రుని నోటి కొక్కమాఱు తాళము వేయలేవుగా ?

వసి——ఈ దుర్మార్గుని ప్రేలనిమ్ము. వీని లెక్కచేయువా రెవరు ? గంధసింధురము రాజమార్గమునఁ బోవుచుండఁ గుక్కలెంత మొఱిగిన నేమి ?

నార——(ప్రకాశముగా) వసిష్ఠా ! అతనివిషయమై నీవు నాతోఁ బ్రసంగింపకుము. నేనేమో తనపైనఁ గొండెములు చెప్పుచున్నట్లతండు తలంచు. (రహస్యముగా) దుష్టున కెప్పుడు దూరముగా నుండుట మంచిది. (ప్రకాశముగా) నాకు మీరిరువురు సమానులే !

విశ్వా——ఏమీ నారదా ! స్తుతిపాఠములచేఁ బొట్టబోసికొను నీతని నాతో సమానము చేయుచున్నావు? నేను నిరంతరశమైన తపోమహిమచేఁ బ్రకాశించుచున్నానుగాని యీతనివలె నొక నీచక్షత్రియాధముని ముఖస్తుతులు చేయుచు ధనము సంపాదించుచుండలేదు.

వసి—ఓరీ! ఆత్మశ్లాఘీ! మన తపోమహిమంబుల తారతమ్యంబులు సమస్త లోకంబులవారికి విదితములే. ఊరక నీగుట్టు నీవే తప్పకొనకుము. భ్రష్టా! తొలుత నీతపోనిష్ఠాభ్యాసంబునకు ముఖ్యహేతుభూతుండ వగు నన్ను నీవు గురుభావంబున మన్నింపక నిందించిన పాపము చాలక, దుర్గుణాధికులగు నీవంటి వారికిఁ బదిమందికి బుద్ధి చెప్పఁదగిన యాహరిశ్చంద్రునిసహితము దూషించుచున్నావేమిరా? ఛీ! ఛీ! నీజన్మమువలన క్షత్రియకుల మొక్కటియే కాక తపోధనజనంబుసహితము కళంకీభూత మగుచున్నదికదరా?

విశ్వా—ఓరీ! బ్రాహ్మణాధమా! అశేష వస్తుజాలంబుల సృష్టింప రెండవ బ్రహ్మనైన నేనురా నీకు శిష్యుండను? వింటిరా! సభాసదులారా! ఈదురాత్ముని యధిక ప్రసంగములు! మీకును నీ దేవేంద్రునకును రుచ్యములుగా నుండిన నుండుగాక! మాకు మాత్రము మహానింద్యములుగాఁ దోఁచుచున్నవి.

నార—విశ్వామిత్రా! ఈ వృథావాగ్వ్యయముతో నేమి ప్రయోజనము? ఈ వసిష్ఠుండు సత్యసంధుఁ డని వర్ణించిన యా హరిశ్చంద్రుని బొంకించునంతటి సమర్థత నీకడ నున్నచో ముందునకు వచ్చి నిలువఁబడుము.

దేవేం—(స్వ) ఓహో! ఈనారదుఁడుకలహమును మఱింత పెంచుచున్నాఁడుగదా!

విశ్వా—నారదా! నీవు చక్కఁగాఁ జెప్పితివి, వసిష్ఠా! నీకును నాకును నీవృథా కలహముతోఁ బనిలేదు. నీమాటల నేము నమ్మఁజాలము. నీ హరిశ్చంద్రుని సత్యస్ఫూర్తి నేఁబరీక్షింతు. పట్టుబట్టి కపటంబులఁ జుట్టి ధైర్యము బోఁగొట్టి యారాచపట్టిని నెట్టులైన గావలసినన్ని బొంకులాడింతు. ఏది! పందెమేమి వైచెదవో ముందునకు రమ్మ అని (లాగుచున్నాఁడు.)

నార—వసిష్ఠా! నీవీసమయమున వెనుకంజ వేయరాదు.

వసి—ఓరీ! అపాత్రా! విశ్వామిత్రా! ఏటికి దుర్ఘటమైన కార్యమును బూనెదవు?

గీ. ప్రళయనిర్ఘాత మఱచేతఁ ♦ బట్టవచ్చు
హేమశైలంబుఁ గొనవ్రేల ♦ నెత్తవచ్చు
దివిని భూమిని రెంటి సం ♦ ధింపవచ్చు
ధర హరిశ్చంద్రు బొంకింప ♦ దరముకాదు.

మఱియు

పారావారములింకనీ, కులగిరి ♦ వ్రాతంబు లిలన్ ద్రొల్లనీ
తారాసంఘము డుల్లనీ, త్రిభువన ♦ ధ్వంసంబు చేకూడనీ,

గారీశుభ్రుకుటీనిరీక్షణ మహో ♦ గ్రజ్వాల చల్లారనీ,
యారాజేంద్రుని బద్ధమాడునె? దు♦రాత్మా! యేటికీబింకముల్.

కానీ, నీకర్మంబు నీ వనుభవింపక తీరదు. సభ్యులారా! ఈ ధూర్తుండు తా హరిశ్చంద్రుని బొంకించెదనని పంతములాడుచు నా పన్నిద మపేక్షించుచున్నాఁడు. కాన నిదే నాప్రతిజ్ఞ మీరందఱు నాలింపుఁడు.

మ. శిరమెల్లన్ గొఱిగించుకొంచు స్వతప ♦ శ్శీలంబులన్ మాని,
సాటిబుధుల్ ఛీ! యన సిగ్గులేని పరిపా ♦ టిన్ గల్లుపెల్లానుచున్
నరపుఱ్ఱన్ ధరియించి, యుత్తరదిగం ♦ తప్రాప్తి నూరేగెదన్
ఖరవాహంబున వాడవాడలును నా ♦ త్మానాథుఁడే బొంకినన్.

[బాపురే బాపురే యని సభ్యులు కరతాళంబులఁ జేయుచున్నారు.]

విశ్వా—సభ్యులారా! యేటి కీకాకిగోల? ఒక్కక్షత్రియాధముని బొంకింప నింత రాద్ధాంతసిద్ధాంతములు కావలయునా? ఈ మూఢుఁడు ప్రజ్ఞకై పెనఁగులాడుచున్నాఁడు గాన నా పన్నిద మిదే వినుండు, నే నాహరిశ్చంద్రుని బొంకింపలేనిచో

మ. హిమశైలంబున వాయుభక్షణుఁడనై ♦ మృత్యుంజయుం గూర్చి
దివ్యమతిన్ జేసిన మత్తపఃఫలమునం ♦ దర్ధాంశమున్ ధారవో
సిమహీన్ బెక్కుమహాయుగంబు లమిత ♦ శ్రీమీఱ నేలించి స్వ
ర్గమునం దీసుర రాజపీఠమునఁ ద ♦ ద్రాజోత్తమున్ నిల్పుదున్.

దీనికిఁ దప్పిన నేనాపరమేశ్వరునిపాదంబులకుఁ దప్పినవాఁడనగుదును కావున వసిష్ఠా

శా. పోరాటం బిఁక నేల? నీయెదుట నే ♦ బొంకింతు నీఱేని నే
డే, రా పోద మయోధ్యకుం గదలిపో ♦ నీ, నీవు మున్నుందుగా
నారాజన్యున కేమి సెప్పికొనెదో ♦ యానీతులన్ జెప్పికొ
మ్మోతేపే చనుదెంతు మించినదిలే ♦ దీ రేపటన్ మాపటన్.

వసి—ఓరీ! జడమతీ! తొలుత నాయిలఱేల కలుగ సత్యమూర్తిగ సృష్టించియుండ నే నతని కిప్పుడు చెప్పవలసిన నీతు లేమున్నవి? చెకిలీ!

సీ. పూవు పుట్టినతోడనే ♦ తావి గొలుపు
సద్గుణంపుఁ జిన్నెలట్టులే ♦ సజ్జనులకు
విసము పుట్టినతోడనే ♦ పొసగు చేదు
దుర్గుణంపుఁ జిన్నెలట్టులే ♦ దుర్జనులకు.

విశ్వా.—ఈ డాంబికపు వచనంబుల కేమిలే నీకు గర్వభంగమగు కాల మాసన్నమైనది. తొందరపడకుము.

దేవేం.—ఏమి విశ్వామిత్రా! నీవు మరల కలహము పెంచుచున్నావు? నీ ప్రయత్నమున నీవుండక ప్రయోజనములేని మాటలతో నీకేమిపని? ఇప్పటికైనా శాంతింపరాదా?

విశ్వా.—(కోపముతో) ఏమోయి! యింద్రా! నేమిందఱము నిన్నొక పెద్దఁజేసి యీ చింతామణిపీఠంబున నుంచినందులకా నీకింత కావరము? నీకు సురాధిపత్యము దొరికిందని హాగరుచే గ్రుడ్డువచ్చి పిల్లను వెక్కిరించిన చందంబున మాకే యెదురుతిరుగసాగినావురా? దేహమెల్ల గన్నులమయమైనను నీయధికారమెంతవరకో యెఱుంగవైతివి.

సీ. గౌతము పడిపంచ ♦ గాచి యద్దము రేయి
"గొక్కొరోకో" యని ♦ కూసినపుడు
రాకాసి మూఁకల ♦ ధాకకున్ భయమంది
గుంటగుంటలనీరు ♦ గ్రోలినపుడు
పక్కితేనికి సుధా ♦ భాగధేయము నిచ్చి
బ్రతికింపుమని కాళ్లఁ ♦ బడినయపుడు
బ్రహ్మహత్యదోష ♦ ఫలమంది నహుషుచే
స్వారాజ్యమును గోలు ♦ పడినయపుడు
ఇట్టి నీయధికారమే ♦ గట్టుఁజేరె
మఱువవచ్చునె యింతలో ♦ మఘవ! నీకు
వడుమ సిరి వచ్చి కలిసిన ♦ చెడుగు బుద్ధి
యర్థశాస్త్రంబు గొడుగు ♦ తెమ్మనక యున్నె?

ఓరీ స్వాధికార గర్వోన్మత్త వ్యర్థప్రలాపీ ! నీకీ యధికారము శాశ్వతమని తలంచుచున్నావారేమి ? నీవీచింతామణీపీఠంబున కర్తవుండవు కావని మాచిత్తమున కిప్పుడు దోఁచినదో యాక్షణంబె నీవు నీమాట మఱలఁ జంకఁబెట్టుకొని కానన క్రంతలకు "అలో లక్ష్మణా" యని లేచిపోవలసి వచ్చినవాఁడవే. నీ ప్రతాపములు నాముందుగాదు. నోరుమాలిన యీగౌతముకడ సాగింపుము.

గౌత—ఆహా ! యీదుర్మార్గుఁ డింద్రవసిష్ఠులనే గాక నన్నును దూషించుచు, నా గుట్టు బయలువేయుచున్నాఁడు. నే నిక్కడ నుండరాదు.

(నిష్క్రమించును.)

దేవేం—అకటా ! దుష్టులకు హితము దెలిపినను నహితమై తోఁచుగదా ?

నార—బృహస్పతీ ! ఈ విశ్వామిత్రుఁడు మన దేవేంద్రుని నిందించుచుండ నీవు కూడ నోరుమాలినవానివలె నూఁకొండుట యుచితమా !

బృహ—విశ్వామిత్రా ! నీకు మతిపోయినదారేమి ? అందఱ దూషించుచున్నావు.

వసి—ఆచార్యా ! ఈ మూర్ఖునితో నీకేమి పని?

బృహ—ఔను ! గయ్యాళిపెండ్లము నెట్లు త్యజింపవలెనో యీలాటి దుష్టులతో వాదము గూడ నట్లే త్యజింపవలయును.

విశ్వా—ఔనోయీ ! నీచవసిష్ఠా ! దురభిమానీ ! ఈలాటి నీతులు స్వవిషయము నందు నీకుఁ బనికిరాకపోయినవి.

అగ—విశ్వామిత్రా ! మన మిఁకఁ బోవుదము. బృహస్పతీ ! ఇంద్రా ! వసిష్ఠా ! పోందము. (విశ్వామిత్రుఁడు తీసికొనిపోవుచుండ)

విశ్వా—వసిష్ఠా ! ఆడినపందెము తప్పిపోవుగదా ?

వసి—సూర్యచంద్రులు గతులు తప్పినను తప్పను.

విశ్వా—అట్లయినఁ బద. (నిష్క్రమించుచున్నాఁడు)

దేవేం—ఆచార్యా ! పోవుదము రమ్ము. నేఁడు నిష్కారణకలహముతో సభ ముగిసి నందులకుఁ జింతించెద.

(అందఱు నిష్క్రమింతురు)

ఇది ప్రథమాంకము

శ్రీరస్తు

# సత్యహరిశ్చంద్రీయము

## ద్వితీయాంకము

[ఆలోచన మభినయించుచు విశ్వామిత్రుఁడు ప్రవేశించుచున్నాఁడు]

దుర్ఘటమైన కార్యక్రమము పైవేసికొన్నందుల కనివార్యంబుగా దాని నిర్వహింపవలయును. ఇందు నాకు జయమా పరాజయమా యని ముందు యోజించెద. (ఆలోచించి) హరిశ్చంద్రుఁడు నా మాయజాలంబులఁ బడక యబద్ధమాడకున్నను సాటిరాచపట్టి సత్యకీర్తి ప్రపంచస్థాయిగా నిలుపఁ గారణమైతినను సంతసంబే నాకు జయంబగు. బొంకినా వసిష్ఠునకున్నంత సంకటము నాకు లేదు. అయినను (గర్వముతో) విశ్వామిత్రుండ నగు నాకు నపజయ భయమేటికి ?

మ. క్రతుభుక్సంతతితోడఁ బోరి, సురలో ♦ కం బొంధు గల్పించి ది
వ్యతపశ్శక్తిఁ ద్రిశంకునం దునిచె నే ♦ భవ్యుండు, ప్రాక్సృష్టికిం
బ్రతిసృష్టిన్ ఘటియించి బ్రహ్మపద మే ♦ రాజర్షి సాధించె, న
ట్టి తపోరాశి తలంప వాని కవె వా ♦ టిల్లున్ జయారంభముల్.

కావున నే నిప్పుడు హరిశ్చంద్రుని యాస్థానమునకే పోయెదను. (గర్వముతో నిష్క్రమించుచున్నాఁడు।

ఇది విష్కంభము.

[పిమ్మట హరిశ్చంద్ర సత్యకీర్తులు తగిన పరిజనములతోఁ బ్రవేశించుచున్నారు.]

వందిమాగధులు-కవిరాజవిరాజము (గేయము, బేహాగ్-ఏకతాళము)

జయము నిరత్యయ సత్యనిధీ! రిపు ♦ జాల భయంకర దివ్యరథీ!
జయము చతుర్నిగమోక్తవిధీ! సువి ♦ శాలదయాత్తమనశ్శరధీ!
జయ మినవంశపయోధిమణీ! విల ♦ సత్కృపమవిక్రమభాద్యుమణీ!
జయము త్రిశంకుకుమారమణీ! స్వభు ♦ జాయుగ హారిధరారమణీ!

హరి—సత్యకీర్తీ! మనరాజసూయాధ్వరంబుచక్కఁగనే నెఱవేఱినది. కానిపూజ్యుఁడైన విశ్వామిత్రమహర్షి దయచేయకుండుట కొంత కొఱతగానే యున్నది.

సత్య—రాజేంద్రా! లౌకికులవలె వనౌకసులగు మునిజనంబు లాచారభంగమున కోర్వరు. అందుచేత వారాశ్రమమువిడిచి రావీలులేకయుండియుండవచ్చును.

భద్రుఁడు—(ప్రవేశించి) విశ్వామిత్రమహర్షి వచ్చుచున్నాఁడు.

[హరిశ్చంద్ర సత్యకీర్తులు వారి కెదురేగుచున్నారు]

(పిమ్మట యథోక్తముగా విశ్వామిత్రుఁడు ప్రవేశించుచున్నాఁడు)

విశ్వా—(హరిశ్చంద్రుని జూచి తనలో ఆహా! యీ పురుషసింహుని దేజోమూర్తి సర్వదా రమణీయముగదా!

చ. పరిచితమయ్యె నాకుఁ గడు ♦ బాల్యమునుండియు, సుప్రసాద వి
స్ఫురితము, రాజలక్షణవి ♦ శుద్ధకళాకలితంబు, సత్య సు
స్థిరమహిమాభిరామము, సు ♦ ధీగుణవంతము, ధీరశాంత మీ
నరవరమూర్తి కన్నులకు ♦ క్షణక్షణ మొక్కకవింత పొల్పునన్.

హరి—బ్రహ్మర్షిసత్తమా! నమస్కరించుచున్నాఁడ. దేవర ఈ మణిపీఠం బలంకరింపుఁడు.

విశ్వా—ఆయుష్మాన్ భవ! (స్వగతము) ఈతఁడు నన్ను యుక్తముగనే సంబోధించినాఁడు. (విశ్రమించును.)

హరి—దేవా! ఇంతకుముందు దేవరవిషయమే ప్రసంగించుచుంటిమి.

విశ్వా—(స్వగతము) సురసభావృత్తాంత మీతని కప్పుడే తెలిసినదాయేమి?

హరి—మునీంద్రా! భవద్దర్శనంబున ధన్యుండనైతి. ఆశ్రమము నిరపాయముగా నుండి తపోనుష్ఠానంబులు నిర్విఘ్నముగాఁ గొనసాగుచున్నవికదా! మఱియును

మ. తదుసంతానము కోరినప్పుడు సము ♦ ద్యద్వల్కలన్ గూర్చునే?
రఘురుల చ్ఛేదకసంభృతిన్ ద్రిషవణ ♦ స్నానార్థమై యుండునే?

నిరతంబున్ దనుయాత్రకై దొరకునే ♦ నీవారధాన్యంబు ? సు
స్థిరహోమాగ్ని ప్రదక్షిణార్చ్యల శుభా ♦ ప్తిన్ వెల్గునే నిత్యమున్.

విశ్వా——కేవల ధర్మస్వరూపుఁడవు. నీవు భూమండలంబుఁ బరిపాలించుచుండ మునిజనంబుల తపంబులకు నేకొఱఁతయు నెట్లగు ?

హరి——దేవా ! మీతపశ్శక్తియే నన్నిధర్మమునుండి గాపాడుచున్నది.

విశ్వా——హరిశ్చంద్రా ! నీవలన నాకుఁ గొంత ధనము కావలసివచ్చినదోయీ !

సత్య——ఋషులలో నగ్రగణ్యత వహించుటకు రాజ్యవిభవంబులనయితము తృణప్రాయముగా విసర్జించిన మీకుఁ గూడ ధనమేల కావలయు ?

విశ్వా——పరమేశ్వరప్రీతిగా నే నిప్పు డొక యాగము ప్రారంభింప నెంచినాను. దానికై.

హరి——అలాగైన మాచే వైవస్వతవంశము చక్కగా ననుగ్రహీత మయినది. మునిచూడామణీ ! మీకుఁ గావలసిన విత్తమెంత ?

విశ్వా——మిక్కిలి స్వల్పము. నీవంటివారి నడుగఁదగినది కాదు.

హరి——ఆర్యా ! ఎంతైననేమి ?

గీ. పాత్రదానంబు సుంతైన ♦ ఫలము గాంచు
ఫలములే దెంత యిడిన న ♦ పాత్రమునకు
మంచినేల నాటిన గింజ ♦ మ్రాను గట్టు
చవిటినేల నశించు గిం ♦ జయును నపుడె.

కావున వలయు ద్రవ్య మెంతయో సెలవిండు. కృతార్థుండనౌదు.

విశ్వా——హరిశ్చంద్రా ! నీవు మాకు స్వతంత్రుఁడవు కావున వినుము.

కం. దంతావళముపయిన్ బల
వంతుం డొక్కండు నిలిచి ♦ పైకిని రతనం
బెంతటి దవ్వుగ దువ్వునొ
యంతపొడవు ద్రవ్యమిత్తు ♦ వా సరిపోవున్.

హరి——వలసినంత గొనిపొండు. నేను దాతగను, మీరు పరిగ్రహీతలుగను నుండుట కన్న మిన్నయగు పుణ్యము నాకింకేమి కలదు ?

శా. లెక్కింపన్ భరమా తపోధనము క ♦ ల్గిన్ బూర్ణులౌ మీవలీ

బెక్కింపన్ దలపోసి కానలయు, గా ♦ దేన్మాటలోఁ దెచ్చి మీ
ప్రక్కన్ జక్కులఁ దేఁడు నిల్పఁడెన మో ♦ వాకంబుతోఁ బెన్నిధుల్.

ఓదేవా ! ధనమిప్పుడే వేసడంబులపైఁ గట్టి మీ వెంటనే పంపి వేయుదు.

విశ్వా—వద్దు, వద్దు, మాకవసరమైనప్పుడు మేమే వచ్చి కొనిపోదుము. అంతదనుక నీకోశమునందే భద్రపఱచియుంచుము.

సత్య—ఆర్యా ! మీధనము మీకడనే యుండుట శ్రేయము.

విశ్వా—(స్వగతము) ఏమిది ? నాప్రయత్నము నితఁడు గుర్తెఱింగినట్లే మాట్లాడుచున్నాఁడు. (ప్రకాశముగా) సత్యకీర్తీ ! మీధనముతోఁ బాటు దీనిని గూడ కాపాడుట కష్టము కాదుకదా.

హరి—ఆర్యా ! కాపాడుట కష్టమని కాదు.

చ. మునివర ! లోకమెల్ల ధన ♦ మూలమ
జ్జనులు పరార్థసంగ్రహణ ♦ సాధనంబు ల్వరికించుచుంద్రు; నం
దనునయినన్ స్వమాతనయి ♦ నన్ సతినైన నను గన్నతండ్రినై
నను దుదిఁ బ్రాణమిత్రునయి ♦ నన్ ధనమందున నమ్మనచ్చునే?

విశ్వా—హరిశ్చంద్రా ! నీయందు నాకట్టి సందేహము కలుగునా ?

హరి—మునీంద్రా ! ఎప్పటికెట్టివాని కెట్టి బుద్ధి పుట్టు టెవరెఱుంగుదురు ?

సత్య—మునీంద్రా ! మహారాజుగారు విచారింపక మాటలాడలేదు.

విశ్వా—అలాగైన నేనా విచారింపక మాటలాడినది ?

సత్య—అయ్యో ! నే నట్లు పల్కుదునా ? కాని మీ యాశ్రమమునందు దీనిని మీరేల దాఁచుకొనరాదు ?

విశ్వా—ఇప్పుడు నీవు మాత్రము విచారించి మాటలాడితివి కాఁబోలు ! ఓయి అమాయికుఁడా !

మ. అకటా ! భద్రము సేయ మాక చటఁగాం ♦ పా! గోడియా! యెప్పుడూ
ఒక నేత్రంబుల మూసి నిశ్చలతపః ♦ ప్రారంభుఁడై యుండు మా
నికడన్ దక్కునె సొత్తు దాఁగ లెవుడే ♦ నిన్ దాని నాశించి దో
చుకొనన్ జేయునదేమి? దాఁచుకొన నచ్చోఁ బెట్టెయా? బేడయా?

సత్య—దేవా ! నిరంకుశమైన మీ తపశ్శక్తియే మీకు సర్వసాధనము కదా !

విశ్వా—ఓహో! నేఁటికి మీ రిచ్చిన యీ మూఁడు గవ్వలకై మా తపశ్శక్తిని గూడా వ్యయపఱచుమనుచున్నావుగా? అలాగైన నొక్కమాఱు నీయమని చెప్పుడు పోయెదను.

హరి—ఆర్యా! క్షమింపుడు. మీయిష్టానుసారమే కానిండు.

విశ్వా—అలాగైన పోయి వత్తును.

హరి, సత్య—(నమస్కరింతురు)

విశ్వా—(పోవుచు దనలో) ఇప్పుడు హరిశ్చంద్రుఁడు నాచేఁ జిక్కినాఁడు. ఇంక నీతని నెట్లయిన నా యాశ్రమమునకు వచ్చునట్లు పన్నగడఁ బన్నవలయు. అందులకై నీక్రూరమృగంబుల నిదివఱకే సృజించితినిగదా! ఇంక నితఁడు నాకెట్లు లోఁబడఁడో చూచెద. (నిష్క్రమించును)

హరి—సత్యకీర్తీ! వాగ్దత్తమైన ధనమప్పుడే యమ్మహర్షికిఁ జెందియుండినచో మన భారము తగ్గియుండును. ఇప్పుడు చిత్తమునకు లేనిపోని సంకటము సంభవించినది.

సత్య—పరధనము విషప్రాయముగా నెంచు మీకే సంకటములు రావు. (ప్రక్కఁ జూచి) ఎవఁడో సత్వరముగా వచ్చుచున్నాఁడు.

[పటాపేక్షముగాఁ గంచుకి ప్రవేశించుచున్నాఁడు]

కంచు—దేవా! దేశమున కేదియో ప్రళయము సంభవించినది.

హరి—ఓయీ! అప్రియముఁ జెప్పుచున్నావు.

కంచు—నాయనగారూ!

గీ. త్వద్భుజారక్షితద్వీప ♦ ధాత్రియందు
ధర్మమెల్లెడ నాల్గు పా ♦ దముల నడువ
సంభవించెను నేఁటి కీ ♦ క్షణములోన
జనవరేణ్య! విశ్వామిత్ర ♦ సరణి యేదొ.

సత్య—చెప్పవలసినది స్పష్టముగఁ జెప్పక మఱింత సంకటపెట్టుచున్నావు.

కంచు—అయ్యా! పట్టణ జనపదవాస్తవ్యులగు జనులు తమ కష్టములఁ జెప్పకొన ద్వారమున వేచియున్నారు.

హరి—వారిని సత్వరముగఁ బ్రవేశపెట్టుము.

[పిమ్మట పౌరులు ప్రవేశించుచున్నారు]

పౌరు—బాబూ! దండములండి.

త్రిభంగివృత్తము (గేయము, ఘరజురాగము—ఏకతాళము)

కనికరమున పసనవిని విను మినకుల ♦ మును వెలయించెడివాఁడా !
నెఱతేఁడా ! మాయెకిమీఁడా !
కనివిని యెపుడెఱుఁగనిమెకములు పొల ♦ మున నిలయానినయట్టుల్
నలుదట్టుల్ గోరపుఁబుట్టల్
జనులఁబసులఁబొరిగొని పయిరులఁ దెగఁ ♦ దినుచు మెలగుచునుండన్
దగుదండన్ దేవరదండన్
గని బ్రతుకుదుమనియనుకొని వినయము ♦ నను జనుదెంచితిమయ్యా
వినవయ్యా కావగదయ్యా !

హరి—సత్యకీర్తి ! ఇదేమి వైపరీత్యము !

పౌరు—బాబూ ! నాగతి యేమైనదో చూడు.

చ. తొడరి పొలాన నే నరక ♦ దున్నుచుఁ బిల్లలకోడిరైన నా
పడతుక నొంటిగాఁ గసవుఁ ♦ బట్టులకున్ బసి నేదఁ బంపి నా
యొడయఁడ ! యేమిచెప్పుదున ♦ యో ! పులివాతకునప్పగించితిన్
గొడుకుల నేలలోని పసి ♦ గ్రుడ్డుల గోర మిఁకేమి తెల్పుదున్ ?

హరి—అయ్యో ! ఎంత కష్ట మెంత కష్టము.

ద్వితీ—బాబయ్యా ! నాసంగతిఁ గూడ వినుము.

చ. పొలములు పైరుపచ్చ పసి ♦ వోయిన నే దురపిల్లగాని, నా
యులజడి యేమిచెప్పుదు దొ♦రా ! యిలు నిండిన యింతలంత గం
పెడు పసికుట్ర లందఱిని ♦ బెబ్బులికే బలియిచ్చి యొంటినై
నిలిచితి గొమ్ముల న్నఱక ♦ నిల్చిన మోదువలెన్ దపింపఁగన్,

హరి—పౌరులారా ! చింతింపకుఁడు. మీ చింతల నివారింతును. సత్యకీర్తి ! ఇప్పుడు వేఁటకేగుటకన్న కర్తవ్య మేమున్నది ? చూడుఁడు.

సత్య—ప్రజారక్షణోద్యోగమున కిప్పుడంతకంటెఁ గర్తవ్యమేమున్నది? చూడుఁడు.

గీ. తనకు సేవనియున్నను ♦ జనవిభుండు
జనుల సేమంబులే కనుం ♦ గొనఁగవలయు

దినదినంబును దప్పక ♦ యినుఁడు లోక
ములను గాపాడకుండునే ♦ వెలుఁగు నిచ్చి

హరి—సత్యకీర్తి ! ఇఁక వేఁటజతనం బొనరింపుము.

[నేపథ్యమున వైతాళికులు]

క. కువలయతాప మొనర్చెడు
రవి యను పెనుమెకము నొంప ♦ రాజే శేరన్
గవిసిన భయమునఁ బరువె
త్తు విధంబున సూర్యుఁ డపర ♦ తోయధిఁ గ్రుంకెన్.

సీ. పలపలన్ దఱిపి మెం ♦ డ లజాండమునకెల్ల
లీలగా నెట్టిని ♦ డాలు గూర్చి
పరరాజునకు నిజ ♦ ప్రాజ్యరాజ్యము వీడి
వరుణదిగ్యాత్రకై ♦ యరిగె నినుఁడు
సతి, బాసి పద్మినీ ♦ సతి కాలగతి చేసి
ద్విజరాజుచేత బా ♦ ధింపఁబడియె
వలరాజు విప్రయో ♦ గులఁ గాల్ప దాకొల్పు
చిచ్చు నాసంజకెం ♦ జిగి రహించె
జక్కవ నిజాంగనకు నయి ♦ సంతసించె
సుతచిర వియోగదుఃఖసం ♦ పతితుఁడైన
వాహినీపతి యానంద ♦ వశతఁ బొంగెఁ
జంద్రుఁ డుదయించెఁ గాంతి ని ♦ స్తంద్రుఁ డగుచు.

హరి—సత్యకీర్తి ! మన మిఁకఁ బోవుదము పద !

(అందఱు నిష్క్రమింతురు)

ఇది ద్వితీయాంకము

శ్రీరస్తు

# సత్యహరిశ్చంద్రీయము

## తృతీయాంకము

[పిమ్మట విశ్వామిత్ర నక్షత్రకులు ప్రవేశించుచున్నారు]

విశ్వా—శిష్యా! నక్షత్రకా! లెక్కలేని రొక్కం బడిగి యొప్పించుకొని హరిశ్చంద్రుని చేజిక్కించుకొనుటయేకాక యతఁ డిక్కడకు వచ్చునట్లు పన్నుగడ బన్నినాఁను. ఇప్పు డతని మనము నాకర్షించు శృంగారరూపరేఖాభుజంగులగు మాతంగాంగనల సృజించెద. ఇందు నీవు గూడ నప్రమత్తుఁడవయి సాయపడవలయును.

నక్ష—గురూత్తమా! ఏదో యొక వ్యాసంగమువలన నాచదువుమాత్రము గ్రీష్మకాలవాపిజలంబువలెనే దినదినం బడుగంటుచున్నది. చూడుఁడు.

శా. సాంగోపాంగముగా వసిష్ఠుకడ న భ్యస్తంబు గావించె మొ
న్నం గార్గేయుఁడు చేరి వేదముల, ♦ మాండవ్యుండొ యేడాదియే
నిం గాలేద యగస్త్యశిష్యుఁడయి తా ♦ నేర్చెన్ దపోనిష్ఠ న
ష్టాంగస్వీకృతి, నాకు రాదిపుడు సం ♦ ధ్యావందనం బేనియున్

విశ్వా—వసిష్ఠునిగురుత్వము నాయెదుట వర్ణింపకు. గట్టిగాఁ బట్టువట్టిన గడియలో విద్యలన్నియు నీకుఁ గరతలామలకంబు గావించెద.

నక్ష—పట్టుబట్టుట యెప్పటికో ?

[పిమ్మట రథారూఢుఁడై హరిశ్చంద్రుఁడు ప్రవేశించుచున్నాఁడు]

ఓ క్రూరవ్యాఘ్రమా ! నిలు నిలుము !

చ. నిలువక నిర్మనుష్య ధర ♦ ణీధర ఘోరదరీచయంబులన్
మెలఁగుచు బక్కణంపుఁ బోలి ♦ మేరలలో రుచిఁజూచుచుంటివే ?
పలువ ! మనుష్యమాంసములఁ ♦ బారకుమిప్పుడు మచ్ఛరాహతిన్
గలుగు సుఖోపజీవనము ♦ గ్రామజనాళికి నేఁటినుండియున్.

సూతుఁడా ! బెబ్బులి వేగముగఁ బరుగెత్తుచున్నది. రాజులపగ్గంబ సడలవిడువుము.

సూతు—ఇదిగో విడిచితిని.

హరి—ఆహా ! రథవేగమునఁ బ్రకృతి యంతయు నెట్లున్నదో చూడు.

చ. ఎడనెడనున్న వృక్షచయ ♦ మేకముగాఁగఁ బెనంగి వెన్కకున్
బటునటు దోఁచు. గంటికిఁ గ ♦ నంబడునట్టిది యిట్టిదంచు నే
ర్పడ దొకపట్టునన్, దిరుగు ♦ వారుచుఁ గుమ్మరిసారెరీతి నీ
పుడమి యెఱుంగఁ జేసెఁడిని ♦ బో ! తన వర్తులమైన యాకృతిన్.

సూతు—చూచుచుండఁగనే మెఱపుఁ దీఁగెలాగునఁ బులి యదృశ్యమైనది. ఏమి మాయ !

హరి—అలాగైన రథము దిగి పాదచారులమై దాని యడుగుజాడలఁ గని పెట్టుదము. (దిగుచున్నాఁడు)

సూతు—(నడుచుచు) దేవా ! ఇది యేదియో జనపదమువలె నున్నది.

హరి—(పరికించి) సూతుఁడా ! ఇది ప్రశాంతమైన మున్యాశ్రమప్రాంతభూమియై చూడు.

మ. అదిగోఁ గాల్నడ రేవులున్న సెలయే ♦ ఱా పొంతలన్ ద్రెళ్లు జా
జాళ్ళు తదగ్రములు గొన్ని కోయఁబడిన ♦ ట్లుందోఁచెనందుండి సాఁ
గి దవష్టంబుగఁ బోవు కాల్నడల చ ♦ క్కిం బోదమిదా చెంత. న
య్యుదెసనీవారపుట్టాహుతిన్ బొడముతి ♦ య్యంబైన నెత్తావియున్.

ఇంకను ముందునకుఁ బోయి విచారింతము. (నడచి) సూతుఁడా !

మ. వనవాసవ్రతకర్మఠోత్తమ భువ ♦ స్స్వాహేతివాదం బదే
కనుఁగొ, మ్మచ్చటగాలిచేత నెగయుం ♦ గాఁ గొమ్మలం దాఱవే
సిన చెంగావి మడుంగు దోవతుల వా ♦ సిన్ జేసి చెట్లుల్ చిగి
ర్చినరీతిన్ బొలిచెన్ వసంతసమయ ♦ శ్రీ విభ్రమాదభ్రతన్.

ఇది యొక పుణ్యాశ్రమము. ఇందు వేఁటకు గడంగరాదు. ఎఱుకులను దూరముగాఁ బోయి వేటాడుమనుము. సత్యకీర్తి యెచ్చట ? చంద్రమతీ లోహితాస్యు లెంతదూరమున నున్నారు ?

సూతు — అయుష్మంతుఁడా ! వారిదే వచ్చుచున్నారు.

[రథారూఢులై చంద్రమతీ లోహితాస్యులును ప్రవేశించుచున్నారు]

[సత్యకీర్తి వెనుక నొక రథముపై నెక్కి వచ్చును]

హరి — (ఎదురేగి) చంద్రమతీ ! లోహితా ! నాయనా ! నీవీయరణ్యమృగములఁ జూచి జడియలేదుగద !

లోహి — నాన్నగారు ! నాకేమి భయము ? నేను పెద్దపులిని గూడ క్షణములోఁ జంపివేయఁగలను.

హరి — (ముద్దుపెట్టుకొనుచున్నాఁడు)

సత్య — నాయనా ! నీవంతటివాఁడవే యగుదువు !

హరి — దేవీ ! మన మిప్పుడున్న తలం బొక మున్యాశ్రమము సుమా !

చంద్ర — ఇచ్చటి మునులు మనకు సందర్శనీయులు. ఈ యాశ్రమ మెవ్వరిదో ?

(తెరలోపల) ఓరీ ! జనార్దనా ! నీవు కుశాపహరణార్థమై పోయి
యెంత సేపైనదిరా ? వేదికయం దుండిన గురువులగు
విశ్వామిత్రులచే నీకు కీఁడు మూఁడినదిలే.

చంద్ర — (ఉలికిపడును)

హరి — విశ్వామిత్ర నామశ్రవణమాత్రమున నీ విట్లులికిపడితి వేమి ?

చంద్ర — నాథా ! ప్రశాంతమైన యీ యాశ్రమమం దున్నను, నామనం బేలాగో యున్నది.

హరి — నాకు నట్లే యున్నది. చిత్తం బేటికో కలవరపడుచున్నది.

సత్య — ఘోరమైన వేఁట కర్జంబు నిర్వహించుటచే సహజ కరుణాయత్తంబగు మీ చిత్తంబున నట్లున్నది. అంతకన్న మఱేమియు లేదు.

చంద్ర — అట్లే కావచ్చును.

హరి—సర్వాంగముల కుచిత్రశ్రమఁ గల్పించుటం జేసి కాఁబోలు నాకు నేఁడు పగలు కూడ నిద్ర వచ్చుచున్నది.

చంద్ర—అలాగైన నీ క్రొమ్మావిగున్న నీడఁ జిగురుటాకు సెజ్జ సేర్పరచెద. నాయంక తలంబుఁ దలగడగా నమర్చుకొని యించుక సేపు సుఖనిద్ర పొందఁదగును.

హరి—ప్రేయసీ! పగటివేళ నిద్ర కేర్పడినది కాదు చూడు.

మ. అరులన్ గెల్చుటకో, కప్పముల్ గొనుటకో, ♦ యర్థిప్రజన్ బ్రోఁచుటో
సురలన్ దన్పుటకో, విద్యలన్ బడయుటో ♦ సుశ్లోకమార్జించుటో
పరిపాల్యంబగు రాష్ట్రమున్ సుఖముగాఁ ♦ బాలించుటో, లేక రా
జు లిరంసన్ నిదురింపఁ జెల్లునె పగల్ ♦ శుద్ధాంత కాంతాళితోన్.

మఱియు నిద్దుర యన్న స్మరణకు వచ్చెను. నిన్నటిరేయి నపరయామంబున నే నొక దుస్స్వప్నము కంటిని.

చంద్ర—అయ్యో! అదెట్టిదో!

హరి.—నేను నిజపురోహిత విద్వజ్జనంబులతోఁ బేరోలగం బుండ, నతిమాత్ర తేజో విరాజియగు నొక మునిరాజు కనుఁగొన నగ్నికణంబు లుమియుచుండ సమీపించి యకారణంబుగ నున్నతంబయిన సింహాసనమునుండి నన్ను నేలం ద్రోసి మన రాజ్యసర్వస్వము గ్రహించి మనలఁ గట్టుబట్టలతో నడవులకుఁ బాఱఁ దోలె. అందు పడరాని పాట్లు బడుచుంటిమి. ఇంతలో మెలకువ కలిగెను.

చంద్ర—అయ్యో! ఎంతటి దుస్స్వప్నము. ఇదంతయు మన కశుభమునే సూచించుచున్నదే. నాకును అట్టి కలయే వచ్చినది.

సత్య—దేవా! దేవీ! మీకే యశుభములును రావు. నిన్నటిదినమున విశ్వామిత్రున కిచ్చిన ధనమతఁడు వెంటనే దీసికొనిపోకుండ మనకడనే యుంచినందులకు జిత్తమున నేమో విచారించుచు నిదురించితిరి. దానిచే నిట్టి కలలు వచ్చియుండవచ్చును. చూడుఁడు.

క. నిదురించుటకును మును దా
మది దేనిఁ దలంచు నదియె ♦ మానవునకు స్వ
ప్నదశన్ గనఁబడినటులై
బదింబదిగఁ గలవరింపుఁ ♦ బలుకులు వెడలున్.

అయినను నిట్టివి దేవబ్రాహ్మణసంతర్పణముల శాంతింజేయఁదగును. చింతింపకుఁడు.

ఇప్పట్టున వినోదముగాఁ గాలము గడుపుటకు మన యాశ్రితులైన సంగీత పాఠకులైన దగ్గర లేరే !

[పిమ్మట నిరువురు మాతంగకన్యలు ప్రవేశింతురు]

మాతం—అర్థిజనకల్పభూజా ! రాజలోకబిడౌజా ! జోహారు !

హరి—సత్యకీర్తీ ! వీర లేకులమువారలో ?

మాతం—మేము మాతంగకులాంగనలము రాజా ! కులములో నేమి ?

సీ. తగనిదే కాని తను దానె ♦ పొగడికొనుట
విమల సంగీత సాహిత్య ♦ విద్యలందు
బలుకుల వెలంది మాతోడి ♦ పాటు సుమ్ము !
సవితృకులదీప శ్రీ హరి ♦ శ్చంద్ర భూప !

హరి—(చంద్రమతితో) దేవీ ! కొంతతడ వీయంగనల సంగీతము విందమా ?

చంద్ర—కాలక్షేపమున కిప్పు డిదియే మంచిమార్గము.

సత్య—మాతంగాంగనలారా ! మహారాజుగారు మెచ్చునట్లు మీ సంగీత కళాకౌశలంబు బ్రదర్శింపుఁడు.

మాతం—భాగ్యము. (అని వీణలు శ్రుతిఁజేసి పాడుచున్నారు)

గీతిక : ఖరహర ప్రియరాగము - ఆదితాళము.

సగసుఁడ ! నే నినుఁ జూడ వలచితిరా
కరుణను నీబిగి కౌఁగిలి వేఁడితిరా ‖సర‖
ని న్నెద నమ్మి నే నిద్దుర మానితిరా
మన్ననతో నొక మాటయు వినరా ‖సర‖

హరి—సత్యకీర్తీ ! వీరు పాడుచున్న గీతికలోని యర్థము నా కంత రుచింపలేదు. కాని వీరి కంఠస్వరము మాత్రము వీణానాదముతో శ్రోత్రపేయముగా నున్నది చూడు—

మ. చెవులెక్కించుచుగొబ్బుమీటుచువిపం ♦ చీతంత్రులన్, దారువుల్
చివురింపం గలకంఠ కంఠరుచిర ♦ శ్రీ గీతముం బాడి రీ
యువతుల్ వీణెలకున్ స్వకంఠరుత మో ♦ హో ! నేర్పుచున్నారనన్
జెవులన్ బిండుచుఁ జెంపలన్ జఱచుచున్ ♦ శిక్షావిధానంబులన్,

కిరికి ముక్తాహారము బహూకృతిగా నిచ్చి పంపివేయుము. (ఇచ్చుచున్నాఁడు)
సత్య—గోసంగిపడుచులారా ! మహారాజుగా రనుగ్రహించిన యీ బహూకృతిని
పరిగ్రహింపుఁడు. (ఈబోవ)
మాతం—రాజేంద్రా ! మాకీ ముక్తాహార మేటికి ?

గీ. ప్రౌఢి మావిద్య మీవంటి ♦ ప్రభువు సూచి
మెచ్చినటులైనఁ బదికోట్లు ♦ వచ్చినట్లె
రసికుఁడవు గాన మాకు నీ ♦ ప్రాపు మొదట
కావలయుఁ గాని పిదప రొ ♦ క్కమున కేమి ?

హరి—ఏమనుచున్నారు? వీరిమాటలు నాకర్థము కాలేదు.
మాతం—రాజేంద్రా ! అర్థము కాకుండుట యెట్టిది ?

గీ. రాజులకు మిన్నవఁట, రతి ♦ రాజువోని
చక్కదనమంట, మిక్కిలి ♦ జాణవు నఁట,
జవ్వనులమఁట, పాటలోఁ ♦ జతురలమఁట
తెలిసికొను మీవె యెవరేల ♦ తెలుపవలయు ?

హరి—సత్యకీర్తీ ! వీరిపరివర్తనము తెలియవచ్చినది. ఇంకవీరి నావలకుఁబంపివేయుము..
మాతం—రాజేంద్రా ! నీపని కోరి యింతదూర మేతెంచిన యర్థనుల వ్యర్థముగాఁ
బంపివేయుట నీవంటిదాతకుఁ దగినపనియా ? ఒకమాఱు నీ యాశ్లేషసౌఖ్య
మొసంగినఁ జాలదే ?
సత్య—ఛీ ! నికృష్టవనితలారా ! ఆవలకుం బొండు.

ఉ. టక్కులమారిపోకలు మి ♦ టారము లెక్కడఁ జెల్లు నక్కడే
మక్కువ దీర్చికొండు, కొఱ ♦ మాలిన మీ బయకారివర్తనా
లిక్కడ సాఁగిరావు, చనుఁ ♦ డీ ! మఱి యీవెడమాటలాడినన్.
గ్రక్కున ఖండఖండములు ♦ గా నఱికింతును మీదు నాలుకల్.

చంద్ర—నాథా ! వీరెంత దుశ్చరితలైనను నర్థులై వచ్చిన కామినుల గుటచేఁ
గొంత సౌమ్యముగానే యవ్వలకుం బంపివేయుట మంచిది.
సత్య—అమ్మా ! ఇంకను నీ చండాలాంగనలఁ బాప మనవచ్చునా ! భద్రా ! శీఘ్ర
నిచ్చటినుండి వెడలగొట్టుము.

భద్రు—ఓగోసంగి కులటలారా! ఇంకను గదలరేమి? మీ వీపులు బ్రద్దలు కావల యునా యేమి?

మాతం—(ఏడ్చుచు) ఓహరిశ్చంద్రా! మమ్మిట్లన్యాయముగాఁ గొట్టించెదవుగా? కానీ! మాతండ్రిగారగు విశ్వామిత్రునితోఁ జెప్పి నీయుసురు దీయింపకున్న మమ్మీపేరులం బిలువవలదు. (అని పెద్దపెట్టున నేడ్చుచుఁ బోవుచున్నారు)

చంద్ర—(విస్మయముతో) నాథా! వీరు విశ్వామిత్రమహర్షి కూఁతులా? అయి నచో మాటలెత లెట్లయినో?

హరి—ఏమో! ఇదంతయు నింద్రజాలమువలె నున్నది. ఇంతకు నేదో దుర్యోగము కొలఁదికై మన మీయాశ్రమోపాంతమునకుఁ జేరితిమి.

గీ. అశుభములు వచ్చునప్పు ♦ డయత్నముగనె
బుద్ధులును వాని కనుకూల ♦ ముగనె తోఁచు
దొంగ యిలు సేరునప్పుడే ♦ దొరను వలచి
నిదుర పెద్దమ్మ శయ్యను ♦ వదలనట్లు.

సత్య—రాజేంద్రా! అదేనో వినవిండు.

[తెర లోపల]

శా. ఔనా! మిమ్ముఁ బ్రచండదండములన ♦ న్యాయంబుగా మోదనా
భూనాథాధముఁడంపెనే భటచయం ♦ బున్ మీపయిన్ బాపియై
కానీ! యింకఁ ద్వద్దుష్టబాష్పఘృతయో ♦ గప్రోజ్జ్వలన్ మామకీ
నాసూనోగ్ర సమగ్ర కోపశిఖి లేదా ♦ మిమ్ము నూరార్పఁగన్.

హరి—(విని) సత్యకీర్తీ! ప్రళయ కాలధారాధర గర్జానుకారియైన యీ సింహ నాదంబు విశ్వామిత్రునిది కాక మఱెవ్వరిది?

చంద్ర—(భయముతో) నాథా! ఇప్పుడేది తెఱువు?

గీ. కనుగొనలనుండి జ్వాలదగ్ని ♦ కణము లురల
వేఁడినిట్టూర్పుఁ బొగ లుడు ♦ వీధి కెగయ
దండము ధరించి రెంగవ ♦ దండధారి
గతి నిటే వచ్చుచున్నాఁడు ♦ కౌశికుండు.

హరి—దేవీ! జడియకుము. కర్తవ్యమునిని దగ్గఱకుఁ దీసికొమ్ము. నిరపరాధులమైన మనల విశ్వామిత్రుఁడు మాత్రమేమి చేయఁగలఁడు ?

విశ్వా—(కోపముతో) ఓరీ! హరిశ్చంద్రా! నీవిప్పు డెక్కడికిఁ బోయెదవురా ?

స్రగ్ధర

కొండంతున్ నిన్ను బ్రేమన్ ♦ గొలువదలఁచినా ♦ కూఁతులీనాఁడు రాఁగాఁ
గొండంచున్ జేతులారన్ ♦ కుమతి! యొసగితే ♦ ఘోరమాదండనంబున్
గండంబై చండ రోషో ♦ గ్ర శిఖల నల నీ ♦ కండ్లఁ గ్రొవ్వేర్వ గాధే
యుండేదండెత్తెనండై ♦ యునికి కడుగుమా ♦ యోపునేమో వసిష్ఠున్

హరి—(భార్యాపుత్రులతోఁ బాదములపై పడి) మహాత్మన్! రక్షమాం రక్షమాం.

విశ్వా—(దురాగ్రహముతో) ఛీ! పాపీ! (కిరీటముఁ దన్ని) అడుగుం బెట్టి మాఆశ్రమమే కాక మాపాదముం గూడ నంటుపరచుచున్నావుగా దుష్టా!

హరి—ఆహా! నేడుకదా నాశిరస్సునకు నుత్తమాంగమను నామము చెల్లినది.

మధురగతి రగడ; కమాసురాగము - ఆదితాళము

ధన్యుఁడనైతిని ♦ తాపసచంద్రా!
మాన్యం బయ్యెను ♦ మామకజన్మము
పావనమగు నీ ♦ పాదస్పర్శము
చే విమలత్వము ♦ జెందెను నాశిర
మేగతి నొచ్చెనో ♦ యీ మృదుపాదములు
వ్రేగగు నాదు కి ♦ రీటము తాఁకున.

విశ్వా—ఓరీ దుర్మదాంధా! వైవస్వతకులకళంకా! ఏమిరా నీమాయావినయములు?

క. పరికింప నెదుట వినయ
స్ఫురణము మోమింత చాటు ♦ వొందిన నిందా
పరిభాషణ మరెరే! నీ
శరణార్థియుఁ జంక దుడ్డు ♦ చందము దెలిసెన్.

ఓరీ! దుర్వినయశీలా! ఇప్పుడు మా పాదము మాత్రమే కాదురా, నీ దుశ్చారిత్రము వలన మా సర్వాంగములు నొవ్వుచునే యున్నవి. ఓరీ! మాయావీ! మా యంగీకారములేక మాయాశ్రమము ప్రవేశించుటకు నీకెవ్వరధికార మిచ్చిరో

తోలుతఁ జెప్పుము. నీరాజాధికారము తపస్వులపైన మాయెడఁ బనికివచ్చు నురా! పనికివచ్చినను,

మ. బలగర్వంబునఁ గన్నుగాన కిట నీ ♦ వారెల్లరున్ జేరి మా
లలితోద్యానలతావితానముల నె ♦ ల్లం ద్రెంచి గగ్గోలుగా
ఫలవృక్షంబుల సొంపడంచి కుసుమ ♦ వ్రాతంబులన్ రాల్చి కా
వలులై మా హరిణార్భకంబుల వధం ♦ బంబోవ నెట్లోర్చితో?

ఇట్లాశ్రమమెల్ల నపవిత్ర మొనర్చుటేకాక యర్థినులై వచ్చిన నా కూఁతుల వ్యర్థము గాఁ బాడించి తుదకు నాలుకలుఁ గోయుదునని బయలుదేరితివఁట! నీతాత ముల్లె వారికేమి గట్టిపెట్టితివి? ఓరీ! దుర్మతీ! మున్నెవ్వరు రాజులు లేరా! వేఁటకు రారా! నీ మృగయావిహారమునకు మావంటి జడదారుల యాశ్రమ ములే కాని పనికిరావేమి? భూచక్రమునందలి రాజులెల్లఁ బాదాక్రాంతులై యుండ నీవు చక్రవర్తిపదమున నొప్పిగుటెంతయు మావంటి మునులయాశ్రమ ములఁ బాడుచేయుటకే యని నా కిదివఱకుఁ దెలిసినది కాదురా, ముని ద్రోహీ! చూడుమిప్పుడు నిన్నేమి చేసెదనో! నీ వేమొనరించినను మంచి దనుచు నీ కిచ్చకంబులాడుచుఁ బొట్టకూటికై నీకు వెట్టిచాకిరిచేయు వసిష్ఠుఁడ ననుకొంటివేమి? నీవొనరించిన యీ యపకృతికిఁ బ్రతివిధానముఁ జేయకుం డుటకు మే మసమర్థులమా?

హరి—ఎఱుఁగక చేసిన నాయపరాధముల క్షమింపుఁడు.

విశ్వా—ఓరీ! వాచాలా! ఏమనుచున్నావు? అపరబ్రహ్మయైన విశ్వామిత్రు నే యెఱుఁగవా ఎట్లు?

సీ. ఎఱుఁగవా త్వత్పురో ♦ హిత వసిష్ఠ తనూజ
శతక నాళీకకుం ♦ జరుని నన్ను?
తలఁపవా ప్రతిబంధి ♦ తస్వర్నివాస త్రి
శంక్వర్థ నిర్మిత ♦ స్వర్గు నన్ను?
మఱతువా గురుతపో ♦ మహిమామాప్రకల్పిత
ప్రతిసృష్టి నిందిత ♦ బ్రహ్మ నన్ను?
తెలియవా యనితరా ♦ ధీనతపోమహా
త్త్వావాప్త ఘోర ది ♦ వ్యాస్త్రు

ప్రాచ్యరాజ్యన్మయాంధకా ♦ రంబు నీదు
కనుల కెగదట్టినంతనే ♦ కానరావా ?
యొడ లెఱుంగవా ? మతిపోయె ♦ నో దురాత్మ !
ఏల యెఱుఁగవు ? చెప్పుమో ♦ రీ ! దురీశ !

హరి—దేవా ! అపరబ్రహ్మను మిమ్మెఱుంగనివాఁ డెవ్వఁడు ?

గీ. జగములం దెందు మీసృష్టి ♦ సాగుచుండఁ
బ్రాఁతపంచాంగ మయిపోయె ♦ బ్రహ్మసృష్టి
తేజమున నగ్ని మీతోడ ♦ దీటురాక
దుర్యశసుపేరఁ దాల్చెను ♦ ధూమరేఖ.

విశ్వా—అలాగైన ఎండకన్నెఱుంగని సుకుమారశరీరలతామతల్లులు గానకళావిలాసినులగు నా ముద్దుకూఁతు లెన్నఁడు రాని రాజవు నీవు వచ్చితివి. ఇంక నోడిలో వరాలకుప్ప వొలికింతువని ప్రాణము లన్నియు నీపైననే నెలకొల్పికొని పరువెత్తుకొని వచ్చినందులకు వారికిఁ దగిన సత్కారము లొనరింపక పొగరుచే మమ్ముఁ గూడ గణింపక నాలుకలు గోయఁబోయినది ? మమ్మెఱిఁగియే అలాగయిన నీ విషయమున నే ముపేక్షాభావముల నుండరాదు. దురాత్మా ! కుసుమకోమలులైన రాజబింబాస్యలపై మోమోటమించుకయైన లేక నాలుకలు గోయుదునన్న నీనాలుక యిప్పుడు వేయి చీలికలుగావలదా? మునిద్రోహీ ! నీముఖము జూచినకొలఁది నేయివోసిన యగ్నివలె నామనంబు భగ్గుభగ్గున మండుచున్నదిరా !

—మునీంద్రా ! నే నొనరించిన వన్నియుఁ దప్పులే యైనను క్షమాగుణసంపన్నులైన మీవంటి తపస్వులకు దీర్ఘకోపంబు సనదు కాన

తోదకవృత్తము : కాఫీరాగము - చతురశ్రగతి.

మనవిని వినుమా ♦ మముం గను గొనుమా
తనయునిపై నిం ♦ తటి పగ చనునా ?
కనికరమున సా ♦ గక యిటు తగునా ?
కనలునఁ బెనుసం ♦ కట మిడనగునా ?

మఱియు,

గీ. పొగరు గలవాని నడఁచుట ♦ పోలుగాక
దీనత నడంగువాని సా ♦ ధింపఁ దగునె?
పడగ నెత్తిన పాముఁ జం ♦ పఁదగు గాని
చచ్చిపోయినదానినే ♦ చంపనేల?

కావున నన్నుఁ జేపట్టినదాక మీపాదమ్ముల విడువను. (అని నమస్కరించును)

విశ్వా—(స్వగతము) ఈతని క్షమాగుణసంపత్తి యెంత యొప్పుచున్నది. (ప్రకాశముగా) విరాగులమై సంసారములఁ బాసి తపస్సుఁ జేసుకొనుచున్న మాకీ దీర్ఘకోపంబు పనదు. నీతప్పులన్నియు నీయందే యుండనిమ్ము. శరణాగత రక్షణ మవశ్యకర్తవ్యము గనుక నీభయంబుడిపి నిన్నుఁ జేపట్టినారము. నా యుపదేశం బొందు గలదు. నీవద్దాని మేరకుఁ దప్పక ప్రవర్తింతువేని నా కోపాగ్ని నిశ్శేషముగాఁ జల్లారును.

హరి—దేవర ధర్మోపదేశంబులఁ బరిగ్రహించుటకు సిద్ధముగానే యున్నాను. పాపకార్యంబునకు నన్ను మీరు పురికొల్పుదురా?

విశ్వా—ఎట్టి పాపకృత్యంబులైనను మాయాజ్ఞయైనవెనుక నయ్యవి పుణ్యకృత్యంబులుగా మారవలసినవే.

హరి—మీరపరబ్రహ్మలుగదా.

విశ్వా—భళీ! నీకు మామహిమ లిప్పుడు బాగుగఁ దెలిసివచ్చినవిగాని—

శా. అన్యాలోచన లేల? యిచ్చితి వివా ♦ హంబాడుమా నేఁడు నా
కన్యారత్నములన్ సురూపవతులన్ ♦ గాంధర్వవిద్యా జగ
న్మాన్యప్రాభవలన్, వయోచిత కలా ♦ మత్తల్లులన్; భూరి సౌ
జన్యశ్రీల; వహింపు మింకను ప్రశస్త ♦ శ్రీ సుఖాభోగన్.

హరి—(చెవులు మూసికొని) దైవమా! నాపాపము శాంతించుగాక.

చంద్ర—(స్వగతము) అక్కటా! ఎంతటియధర్మమునకుఁ బాల్పడమనుచున్నాఁడు

సత్య—మునీంద్రా! ఇది యెంతైన సరియైన యుపదేశమా?

శా. అంటన్ గూడని మాలకన్నియలతో ♦ నామేలు మేల్పెండ్లి పే
రంటా? వీరవివంశరాజుల యశః ♦ ప్రాకట్య మిప్పాటిదా?
అంటన్ గూడని వేల్పుసాక్షిగ వివా ♦ హంబైన యిల్లాలి గొం
తంటంగోసి తదన్యకన్యల వివా ♦ హంబాడుటే ధర్మమా?

విశ్వా—ఓరీ! మూర్ఖా! సత్యకీర్తీ! నీవిప్పుడు లేని సంబంధము కల్పించుకొని మాతో నిర్భయముగాఁ బ్రతివాదము చేయుచున్నందులకుఁ బిడుగువంటి మా శాప మిప్పుడే నీమీఁదఁ బడుం జుమీ?

చంద్ర—(స్వగతము) అక్కటా! కోప మంతకంతకు మితిమీరుచున్నదే.

లోహి—ఓ బ్రాహ్మణుఁడా! నీ వెవ్వఁడవు? మమ్మందర నదలించుచున్నావు?

చంద్ర—నాయనా! నీవైన నీతాపసుని కోపాగ్ని కింధనం బవుగాక బ్రతికియుండుము. (దగ్గఱకుఁ దీసికొనును.)

విశ్వా—ఓరీ! చెడుగా! నీ విప్పటినుండియు నీశౌర్యము మావంటి జడదారులపై నుపగించుకొనుచున్నాఁడవురా, శుంఠా!

హరి—ఆర్యా! కన్నులు దెఱవని పసితో నేమి?

విశ్వా—ఓరీ! కపటశీలా! నీవును నీమంత్రియుం జాలక నీకొడుకునుఁ గాట్లకుక్కవలె మాపైకి నుసిగొల్పుచున్నావుగా?

హరి—దేవా! బాల్యచాపల్యముచేఁ బలికినవాని యపరాధమును క్షమింపుఁడు.

విశ్వా—క్షమించినారము. ఇంక మాయాన నిర్వర్తింపుము.

హరి—మునీంద్రా! సకలధర్మస్వరూపులగు మీరు నాకిట్టి దురూపదేశ మొనర్పఁ బాడియా? చూడుఁడు.

మ. అరయన్ వంశము నిల్పనేకద వివా ♦ హం? బట్టి వైవాహిక
స్ఫురణంబిప్పటికెన్నఁడో జరిగె; స ♦ త్పుత్రుండుపుట్టెన్;వయః
పరిపాకంబును దప్పుచున్నయది యీ ♦ ప్రాయంబునన్ వర్ణసం
కరపుం బెండిలి యేల చుట్టెదవు? ♦ నాకంతంబునన్ గౌశికా!

మునీంద్రా! ఇహపరంబులకు రెంటికిఁ జెడుమార్గంబును నన్నేలత్రొక్కమందురు? దురంతమైన యట్టి పాపకర్మం బాచరించి ముందుఁ బరసౌఖ్యంబునకుఁ జెడుమందురా?

విశ్వా—ఓరీ! మూర్ఖా! నీ మేలు నీవు చూచుకొనలేకున్నాఁడవు. ఎప్పుడో వచ్చు పరసౌఖ్యముల నమ్మి యిప్పుడు కంటికిఁ గనఁబడుచున్న సామ్రాజ్యాద్యుత్తమభోగంబులు విడుచు వెఱ్ఱివాఁ డెందైనఁ గలఁడా? వీరినిఁ బెండిలియాడకున్నమాత్రమున నీకొఱకై స్వర్గద్వారములు తెరచిపెట్టబడియుండుననుకొంటివేమి? మీవంటి తుచ్ఛరాజులకు స్వర్గసౌఖ్యములు కూడనా? "రాజ్యాంతే నరకం ధ్రువమ్" మ్మను వాక్యము వినవో? కాన వ్యర్థప్రతివాదములు చాలించి మాయాజ్ఞాప్రకారం బీపంచమ కన్యలం బరిగ్రహించి పూజ్యమైన

సామ్రాజ్యభోగంబులతోఁ బాటుగ నీయంగవలవలని భోగంబుల యథేచ్ఛగా ననుభవింపుము.

హరి—అకటకటా! ఇదియెక్కడనైన సరియైన బోధయా. మానుషజన్మమెత్తినందులకుఁ బాపుల శిక్షింపఁ బైన దండధరుం డొకఁ డున్నాఁడనియైన దుష్కార్యములపొంతఁ బోకుండవలయునుగదా!

విశ్వా—ఓరి! వెకిలీ! నీకింకనుఁబాపపుణ్యవివక్షతయెందులకు? ఏమీ దండధరుఁడా?

శా. పాపంబే యగుఁ బుణ్యమే యగును వి ♦ శ్వామిత్రసిద్ధాంతమా
వ్యాపారంబును బూర్వపక్ష మొనరిం ♦ పన్ దండహస్తుం డెవం
డాపాపిష్ఠునిజోలి యెందులకు? న ♦ వ్యస్వర్గరాజ్యప్రతి
ష్ఠాపాండిత్యముచేత నీ జనకు జా ♦ డన్ నిన్ను రక్షింపనే.

కావుననే నీవా యమునిభయంబు దక్కుము. ఇదిగో

మ. అరణం బిచ్చెద నేమి కావలయునో ♦ యర్థింపు. సంతానపుం
దరులో, జక్కులతేని పెన్నిధులో, చిం ♦ తారత్నమో, హేమభూ
ధరమో, కౌస్తుభమో, సుధారసమొ, ఇం ♦ ద్రత్వంబో, బ్రహ్మత్వమో
ఉరగాధీశ ఫణోల్లసన్మణిగణం ♦ బో, కాక యింకేవియో.

హరి—దేవా! మీ తపోబలం బెంతకైనఁ జాలినదే కాని,

శా. "సిగ్గేలాగున లేకపోయెఁ దనకి ♦ స్సీ గాధిరాట్పుత్రి యే
లగ్గో కూర్చెదనన్న నాసపడి యి ♦ ల్లాలుండ నిర్భీతి నే
యెగ్గూహింపకమాలకన్నియలదో ♦ యింబొంది యర్కాన్వయం
బగ్గిం ద్రోసె" నటంచు ఛీ! యనరె నన్నాబాలగోపాలమున్.

విశ్వా—ఓ ఆత్మశ్లాఘీ! దురభిమానీ! నాకూఁతులఁ బెండ్లియాడిన నీకు లోకనిందగా? నీ మొగమున కట్టి భాగ్యమే కలిగిన నీ భోగభాగ్యంబులు మూఁడు పువ్వు లాఱుకాయలుగా నుండి నిన్నుఁ బట్టఁ బగ్గంబు లుండక.

గీ. "ఇతఁడె యీతఁడె నూతన ♦ సృష్టికర్త
యైన గాధేయు నల్లు" డ ♦ టంచు నిన్ను
నందలంబుల నిల్పి జో ♦ హారు లిడరె
నర సురాసుర యక్షగం ♦ ధర్వులేని?

హరి—తాపసోత్తమా ! మీకు నేనేమని ప్రత్యుత్తరం బిత్తును.

శా. ఆకుం బోకను బొంద దీపలుకు, న ♦ వ్యంబైన బ్రహ్మాత్వ మే
మీకై లాటపుమాలకాన్పులివియే ♦ మీ ! లోకదూష్యంబుమీ
వాకుంబొందుటఁజూచి యేమొగముసన్ ♦ నాయెత్తైదన్ ?మీకులం
బేకాదా మఱి నాది ? చెల్లుబడియా ♦ నే యిట్టి సంబంధముల్ ?

విశ్వా—ఓరీ! కృతఘ్నా ! నీ మేలు కోరి నీకు హిత ముపదేశించు చున్నందులకు "కొత్తగా వచ్చిన బ్రహ్మాత్వ" మని మమ్మధిక్షేపించు చున్నావుగా ! అలాగైన నీగురుపుత్రుఁడగు శక్తి శాపమువలనఁ జండాలత్వము గాంచిన త్రిశంకు నందనుండవగు నీదిమాత్రము కాదేమి ? కరుణామతిచే మీయందు రాజసత్వముఁ బునఃప్రతిష్ఠ యొనర్చుట మాదియే తప్పు. ఇంతకు మాయిచ్చు నీయపూర్వ విభవంబులతో మాకన్యలం బరిగ్రహింతువా లేదా చెప్పుము.

హరి—మునీంద్రా !

పంచచామరము జంఝూటిరాగము – ఆదితాళము

వృథాకదా సుధారసంబు ♦ రీతి నన్ను నాకుల
ప్రధానధర్మముం దొలంగ ♦ భాగ్యభోగసంపదల్
అధోగతుల్ తొలంగ రాజ్య ♦ మైనఁ గాని వీడెదన్
బుధోత్తమా ! వరింప మాల ♦ పూవుఁబోండ్ల నమ్మునఁడీ.

విశ్వా—హరిశ్చంద్రచక్రవర్తీ ! ఆమాటలయందు నిలిచియుండుము. తప్పిపోయిన నా సదాశివుని పాదంబులకుం దప్పినవాఁడ వగుదువు. చిరకాలంబునుండి మరల రాజ్యం బేలవలయు నను తలంపు నామది బాధింపుచున్నది. నేటికి నీయౌదార్యముచే నాకది లభించినది. పట్టణంబున కిప్పుడే బోయి సింహాసనం బధిష్ఠించెద. అచ్చట రాజపురుషు లభ్యంతరము చెప్పకుండుటకు నీ ముద్రిక నిమ్ము. ఆడినమాట తప్పకుండుము.

హరి—ఆడి బొంకుదునని తలంచితివా ?

మ. విడువంగాఁబడె నెన్నఁడో చెఱుకుపి ♦ ప్పింబోలె మీచేత మున్
విడువంగాఁబడి సారమెల్ల నెది దా ♦ నిన్ మీరలాశించి న
న్నడుగంగాదని చిన్నబుచ్చఁగలవ ♦ య్యా ! మిమ్ము నిస్సారపుం
గొడ్డల్ రాచరికంబు సౌఖ్యములు మీ ♦ కుంగ్రొత్తలావిందు లే,

విశ్వా—ఇఁక నీచమత్కారములు మాకడఁ జెల్లవు. వారి వీరివలె మమ్ము నీ మాయా జాలంబులఁ బడవేయ నెంచితివి. ఈలాటి కుయుక్తులు మాకు నీకంటె ఆక్కు తెలియును. రాజులందఱిలో నీవేమో సత్యసంధుఁడ వని వింటిని. నేటికా పేరు నేతిబీరకాయ యైనది. మాట పెదవి దాఁటుటకు ముందే యోజించు కొనవలసియుంటివి. పిదపఁ బశ్చాత్తాపముఁ బొందినఁ బ్రయోజనం బేమి! ఇఁక వేయిమాటలతో నేమి? నేనిప్పుడు ప్రసంగాంతరమునఁ బొరపాటున నట్లంటి. రాజ్యము నీకీయఁదలఁచి కాదు.'' అనిస్పష్టముగాఁ జెప్పివేయుము పిదప నే ప్రత్యుత్తరం బిచ్చిన ఛీ! యనుము.

చంద్ర—నాథా! ఏల సందేహించెదరు?

మ. తరుణిన్ నేనొక పాటిసే తమకుఁ గ ♦ ర్తవ్యంబుబోధింప? ని
ద్ధరకాణాచియె మీకు నొక్కరికి? మా ♦ ధాతాదిరాజన్యు లెం
దఱు పాలించిరి, యెందరేగి, రిక నెం♦దఱో్వవనున్నార లో
క్కటయేనిన్ వెనువెంట గట్టికొనియే ♦ గన్ జాలిరే యింతకున్.

శా. మేనన్ బ్రాణములున్నయంతవఱకున్ ♦ మిథ్యానుబంధంబునన్
దానల్లాడుఁ బ్రపంచ మెల్లఁ దనదే ♦ నాన్ జచ్చుచో గడ్డిపోఁ
చే నిన్ వెంబడిరాదు, ప్రాణికి యశం ♦ బేతక్క; లేలెం డనూ
చానుండిమ్మునికిందు దానముగ రా ♦ జ్యంబుల్ యశంబున్ గనన్.

విశ్వా—(స్వగతము) ఆహా! ఈపతివ్రతాలలామ సత్యవ్రతాభిమాన మెంత యొప్పు చున్నది!

హరి—ప్రాణేశ్వరీ! నీవు నాపాలిటి కల్పలతవు. లోకంబుల కనుకూల దాంపత్య మిట్లు గదా యుండవలయును?

గీ. పతుల యత్నంబు లొనఁగూడు ♦ సతులు గూడ
విఱుపుమాటలవారిని ♦ వేఁపకున్నఁ;
బాదులను మొక్క మొలచిన ♦ దాదిఁ బురుగె
తొలఁచుచుండిన నది యెంత ♦ దూర మెదుగు?

(దోపిలి యొగ్గి) ఓ భగవతీ! భూదేవి!

సీ. సతతదానక్రియా ♦ రతుఁడ నంచు జగానఁ
భేరంధినాఁడ నీ కారణమున

క్రతువు లొనర్చి దే ♦ వతలు మెచ్చ యశంబు
గణియించినాఁడ నీ ♦ కారణమున
మితిలేని ద్రవ్యసం ♦ గతుఁడనై భోగ వి
స్తారుండనైతి నీ ♦ కారణమున
చతురబ్ధివేష్టిత ♦ క్షితిపసంతతియెల్లఁ
గనుసైగ మెలగె నీ ♦ కారణమున

గీ. ఇంతకాలంబు నన్నాశ్ర ♦ యించుకొంటి
విప్రుడు విధి తప్పినచ్చుట ♦ నేనె నిన్ను
నమ్ముకొనుచుంటి సత్య ♦ వి త్తమ్ముకొఱకు
శ్రీగుణోద్దామ ! రాజ్యల ♦ క్ష్మీలలామ !

(చంద్రమతితో) దేవీ ! దానధారాసంభృతంబగు బంగారు భృంగారువు గైకొనుము
చంద్ర—(దానజలము విడుచుచుండ)
హరి—బ్రహ్మర్షిసత్తమా ! రాజ్యదానంబు పరిగ్రహింపుఁడు.

శా. దేవబ్రాహ్మణ మాన్యము ల్విడిచి భ ♦ క్తిన్ సప్త పాథోధి వే
లావిభ్రాజ దఖండ భూవలయ మె ♦ ల్లన్ మీకు దానంబుగా
భావం బందొక శంక లేకొసఁగితిన్ ♦ బ్రహ్మార్పణం బంచు దే
వా ! విశ్రాంతిగ నేలుకొమ్మికను నీ♦వాచంద్రతారార్కముమున్.

రాజర్షితిలకా ! రాజలాంఛనంబగు కిరీటంబు ధరించి యీ ధారుణీచక్రము నిర్వక్రముగాఁ బరిపాలింపుము.
విశ్వా—హరిశ్చంద్రా ! నీయౌదార్యము మిక్కిలి శ్లాఘనీయము. నీకు దీర్ఘాయురారోగ్యములు కలుగుఁగాక ! నీవింక నీభార్యాపుత్రులతో మారాష్ట్రంబువదలి పొమ్ము. సత్యకీర్తి మంత్రిత్వమునకై యిక్కడనే యుండవలయును.
హరి—చిత్తము. (సత్యకీర్తితో) మంత్రిసత్తమా ! సత్యకీర్తీ ! నీవింక నిమ్మహర్షి నాశ్రయించుకొని కాలము వెళ్ళబుచ్చుము.
సత్య—(దుఃఖముతో)

మాలినీవృత్తము : రాగము ముఖారి - ఆదితాళము

అమలగుణకలాపా ♦ హా ! హరిశ్చంద్రభూపా !
నిమము వదలిన నే నీ ♦ మీఁద జీవింపఁగలనా ?

తమ కెపుడు నివాస ♦ స్థానమౌ నీటిఁ బాయన్
నిమసమయినఁ దమ్ముల్ ♦ నిల్చునే వాడకుండన్ ?

ప్రభూత్తమా ! ఇన్నాళ్ళు ముద్దుగాఁ బెంచి కడకు చిలుకను గండుబిల్లికి వలె నీ కౌశికునకు నన్నప్పగించెదరా ? నేను మీకడ నుండఁదగనా ?

హరి—సత్యకీర్తీ ! నీవు ధీమంతుఁడవు. నిన్నుగూడ నావెంటఁ దోడ్కొనిపోయితి నేని విశ్వామిత్రుఁడు నాగొంతు గోయుకకమానఁడు. అదియునుం గాక నా రాజత్వముతోఁ బాటు నీమంత్రిత్వము గూడ మాఱినచో రాష్ట్రీయ ప్రజా ఘోషంబు మితిమీఱక మానదు. కావున నీవు నామాటఁ బాటించి పురంబున నేగుము.

(ఆకర్ణించి) ఎక్కడిదా కలకలము ?

[పిమ్మట రాష్ట్రీయ ప్రజలు గుంపులుగుంపులుగాఁ బ్రవేశించుచున్నారు]

పంచచామరము : గేయము - త్రిశ్రగతి.

జలంబు మీఱు గాధిపుత్రుఁ బట్టికొట్టి చంపుడీ
ఖలుండు వాని. ప్రాళ్లబట్టు ♦ గట్టి యగ్గి వేల్చుఁడీ
మలినుసుండు వానికాయ ♦ మాంసమెల్లఁ, గోసి యీ
పొలాన నున్న పక్షిజాతి ♦ భూతకోటిఁ దన్పుడీ.

(అని కత్తులఁ ద్రిప్పుచున్నారు)

హరి—సత్యకీర్తీ ! చూచితివా ? పౌరులెంత నిర్భయముగా సంచరించుచున్నారో !

విశ్వా—(స్వగతము) భళిరే ! వీరిరాజభక్తి యెంత నిరూఢమైయున్నది ? వీరిప్పుడు నాప్రాణములఁ దీసినను దీయవచ్చు.

పౌరులలోఁ బింగళకుఁడు—అరే, ఆ దొంగముని ఎక్కడ నున్నాఁడురా ?

రైభ్యుఁడు—వీఁడేరా ?

శోషాణకుఁడు—అరే ! ఊరకుందువేమిరా, పొడువుము.

హరి—పౌరులారా ! ఏమి యీ సాహసము !

పౌరులు—(వినకయే) సుగంధివృత్తము : గేయము - త్రిశ్రగతి.

మచ్చుఁజల్ల రాజ్యమెల్ల ♦ మాయగా గ్రహించి యీ
సచ్చరిత్రు నూరినుండి ♦ సాఁగనంపు దేమిరా !
పచ్చిదొంగ ! నీతపంబు ♦ పాడుగాను ఏలరా !
హెచ్చుగాను బెంచుకొన్న ♦ యీ జడ ల్దహింపనా !

(అని కొట్టఁబోవుచున్నారు

విశ్వా—(స్వగతము) ఇప్పుడు వీరిపైఁ గోపించి శాపం బిచ్చుటకంటె హరిశ్చంద్రు నడలించుటయే యుచితము. (అని కోపముతో) ఓరీ! కపటశీలా! హరిశ్చంద్రా! మరల రాజ్యమును గ్రహించుటకుఁ గడకీపన్నాగముఁ బన్నితివిరా?

హరి—(కోపముతోఁ బౌరులఁ జూచి) పౌరులారా! మీ కీయాగడము తగదు. ఇమ్మహానుభావుఁడే మీకింకఁ బ్రభువు కాన నెప్పటియట్లు రాజభక్తియుక్తులరై ప్రవర్తింపుఁడు. నాకు మాటఁ దెప్పింపకుఁడు.

పౌరు—మహాప్రభూ! మమ్మీపెద్దపులికే యొప్పఁజెప్పి పోయెదరా?

హరి—పౌరులారా! మహర్షులఁ దిరస్కరింపఁగూడదు. మఱియు,

మ. చనునే యింతటిసాహసంబు? ధరణీ♦సామ్రాజ్యమెక్కాలమొ
క్కనికే చెల్లునె? కాలపుంబ్రకృతినా♦క్కండేగని:కొక్కఁడౌ
ను నృపుం;డీవరజన్మమిట్లుగనుచుం♦డున్ మార్పులన్ రాష్ట్రపుం
జను లేనాఁటికెవ్వఁడో తేఁ,డతనిని♦చ్ఛంగొల్వనౌ మెచ్చుగన్

చంద్ర—పౌరులారా! భర్తగారి మాట జవదాటకుఁడు.

పౌరు—అమ్మా! మేమింకఁ జేయవలసిన దేమున్నది?

ఉ. మమ్మును గన్నబిడ్డల క్రమ♦మమ్మున నింతకు మీరు పెంపఁగ
ష్టమ్ములు లేక మీకరము♦చాటున జల్లగ నుండ గష్టకా
లమ్ము ఘటిల్లె మీకె; విచ♦లత్పవనాహతి వ్రేళ్లతోడ మూ
లమ్మొ గుభాలునన్ బడ ని♦లన్ జిగురాకు లిఁకేమిరాజిలున్?

హా. రాజాధిరాజా! ఎంతలో నెంత యన్యాయము సంభవించినది?

సింగ—సీ. ఇలరేఁడ! గంపంత♦బలగ మిచ్చుట వీడి
యొంటిగా నడవి నె♦ట్లుందువయ్య

రైభ్య— శ్రీదేవి! చంద్ర♦మతీదేవి! నీవంటి
బంగారు తల్లి నెవ్వం♦డొసంగు

రోహ— వని కేగెదవె? చిన్ని♦బాబయ్య! నీకింక
వేళకు నన్నమె♦వ్వాఁడి లభించు

పల్ల— ఈ పుట్టువులకు నీ♦వే సత్యకీర్తయ్య!
యాదరువుగ నుండ♦రాదఁటయ్య

పింగ—సీ. కడుపుఁ గండలఁ గోయు నీ ♦ జడలమాటి
అధిప! మాకేడ దాపుర ♦ మయ్యెనయ్య
రైభ్య— జగము పాలించు మేల్దొర ♦ సాని వీవె
యిట్టి యగచాట్ల పాలైతి ♦ వేమనందు.

హరి—పౌరులారా! దుఃఖింపకుఁడు. సత్యకీర్తీ! వీరితో నీ విఁకఁ బట్టణంబున కేగుము. మేమిక్కడనుండియే పోయెదము.

సత్య—అక్కటా! నే నెంత దురదృష్టవంతుఁడను; రాజేంద్రా!

ఉ. చిన్నతనంబునుండి ననుఁ జేరఁగఁదీసి కుమారురీతిగా
మన్ననతోడఁ బెంచి తన ♦ మంత్రిపదంబున నుంచినట్టి నా
కన్నగురుండ వీగతినిఁ ♦ గానలపాలయి పోవుచుండ మీ
సన్నిధినుండ నోచుకొనఁ ♦ జాలనియట్టి కృతఘ్నుఁడన్ గదా

అమ్మా! నేను తల ఊయి జేసికొని పోవుచున్నాను. తిరిగి యెన్నాళ్ళకో మిమ్ముఁ జూచుభాగ్యము. నేను మీలోహితునివంటివాఁడనైనను మీవెంటఁ గొనిపోకుండ మీరు లేని యీపాడుపురంబునకుఁ బొమ్మనుచున్నారుగదా!

హరి—(కౌగిలించుకొని) సత్యకీర్తీ!

చ. ఇదివరకెన్నఁడున్ గుణని ♦ ధీ! జవదాటవు నాడుమాట యీ
యదనునఁ గూడ నాపలుకు ♦ లారసి యీకుశికప్రసూతికిన్
ముదమొదవన్ జరింపుసత ♦ మున్;గలదేని ఋణానుబంధమే
యొదవుఁ బునస్సమాగమ సు ♦ ఖోన్నతులే మనకీజగాన నే.

సత్య—హా! యెంత కష్ట మెంత కష్టము!

విశ్వా—సత్యకీర్తీ! నీవింకను గదలకున్నావేమి? నీవు పోయి పురంబెల్ల నలంకరించి మదీయ పట్టాభిషేకోత్సవముఁ జాటఁబంపుము.

సత్య—అయ్యో! హరిశ్చంద్రుఁడు లేని యయోధ్య కింకెక్కడ యలంకారము? రాజేంద్రా! పోయి వత్తును. మీకు శుభంబగుగాక!

హరి—సత్యకీర్తీ! పౌరులారా! పోయి రండు.

(పౌరులును సత్యకీర్తియు నిష్క్రమింతురు)

విశ్వా—హరిశ్చంద్రా! నీవింక నిక్కడ యుండవక్కఱలేదు. మాకుఁ జాలప్రొద్దు పోయినది. పొమ్ము.

హరి—చిత్తము. (పోవుచుండ)

విశ్వా—ఉండుండుము. నాదగ్గఱకు రమ్ము. సింహాసనముపైఁ గూర్చుండి రాజ్యం ఏలు మాకుఁ గాని యీ మణిభూషణంబులు మీ కేల ? కావున మీ మీనగ లన్నియు నిక్కడ దిగవిడిచియే పోవలెను.

హరి—అలాగే తీసికొనుఁడు. (అని నగలనిచ్చి) దేవా ! మేమిఁకఁ బోయి వత్తుము.
(నిష్క్రమించును)

విశ్వా—(స్వగతము) ఎందునను నీరాజేంద్రుఁడు లోఁబడకున్నాఁడే. ఇప్పుడు మఱి యొక యెత్తు నెత్తెదను. (బిగ్గఱగా) ఓరీ ! హరిశ్చంద్రా ! హరిశ్చంద్రా !

హరి—(ప్రవేశించి) దేవా ! మఱల నేమి ?

విశ్వా—(కోపముతో)

మ. అగరే ! యెంతటి మోసగాఁడవుర స ♦ త్యం బన్న నిప్పాటిదా ?
పరవిత్తంబును బాయసంబుగ భుజిం ♦ పం జూతువా ? నాడు న
క్కరయజ్ఞార్థము దానమిచ్చినది రొ ♦ క్కం బెక్కడన్ దాచినా
వుర ? ఛీ ! కక్కినకూటి కాసపడు దు ♦ ర్బుద్ధుల్ ప్రశంసింతురే?
దురాత్మా ! మా ఋణధనం బెగవేసి పోవ నెంచితివిరా ?

హరి—మునీంద్రా ! ఎక్కడి దా ఋణంబు ?

విశ్వా—(కోపముతో)

శా. ఏమీ ? యెక్కడిదా ఋణం ? బసలు లే ♦ నేలేద ? మో మెత్తి యే
దీ మావంకను దేఱిచూచి యనుమ ♦ ట్లే, యెట్లు నోరాడునో?
యీమాటాడున దేది వాకొనుమునా ♦ ల్కా? తాటిదూలంబ? ఛీ!
యీ మర్యాదకు సత్యమూర్తియని నీ ♦ న్నెట్లాడు రాలోకముల్ ?

హరి—మునీంద్రా ! మమ్మింత యన్యాయముగా బాధించుట పాడియయ్యా !

గీ. ధరణి సర్వస్వమున్ మీకే ♦ ధారవోసి
కట్టుబట్టలతో నిట్లు ♦ నట్టడవికి
దైన్యమున నేగుచున్న ♦ మాతలను నింక
లేనియప్పులఁ గట్టఁ జె ♦ ల్లింప నగునె ?

విశ్వా—ఓరీ ! పాపిష్ఠా ! కృతఘ్నా ! దుర్మదాంధా ! యేమని వాగితివి ? ఇంక నొక్కమాటట్టి కూఁత కూయుము. నీ నాలుక పీకించి గ్రద్దలకు వేసెదను.

చేతఁగాని యావుల ముం దేడ్చుట యెందుకు ? పిదప నీలాటి తులువకూఁత కూయు టెందుకు ? మాసొమ్ము మేమడుగుట లేనియప్పం దలం గట్టుటా ! ఈరాజ్యదానంబుఁ గూడ దానిలోఁ జేరినదా ? చెప్పుము.

హరి—మునీంద్రా ! కోపింపకుఁడు. నేనిప్పుడు చేత నఱకాసైనలేని నీచదరిద్రగతి యందున్నాఁడగదా ! ఇంక నొక్కమాసంబు గడువొసంగిన నేపాటునైనం బడి మీసొమ్ము చెల్లించెదను. నన్నింక వదలివేయుఁడు.

విశ్వా—అలాగునఁ జేయుము. మొదటనే య ట్లడుగుకొనిన నెంత బాగుండును ?

హరి—క్షమింపుఁడు. నేను పోయి వత్తు.

విశ్వా—పొమ్ము. (కొంచె మూరకుండి) హరిశ్చంద్రా ఉండుండుము. ఇంక మా కొక్క సందేహము బాధించుచున్నది. నీకు దినదినము లభించు ద్రవ్య మన్నపానాదులక్రింద వ్యయపఱచుచున్న మా ఋణ మెట్లు దీఱగలదు ? ఎప్పటి దప్పుడే పుచ్చుకొనుచుండిన మాకునుమీకును సౌలభ్యముగా నుండును, ఆహారముపట్ల మోమోటము పనికిరాదు. కావున నీపైఁ దరువుగ నా శిష్యుని నక్షత్రకుని బంపెదను. శిష్యా ! నక్షత్రకా !

నక్ష—(ప్రవేశించి తనలో) మాగురువుగారెంతలో రారాజును బిచ్చలరాజుం జేసినారు ! (ప్రకాశముగా) గురూత్తమా ! నమస్కరించు చున్నాను.

విశ్వా—(రహస్యము నభినయించుచు) నక్షత్రకా ! నీవీరాజువెంట నేఁగి యాయా ప్రదేశములందీతఁడు గణించిన రొక్కంబునం దొక్క కాసైన వ్యయపఱుపనీయక చేఁజిక్కించుకొనుచు మోమోటము విడిచి నిర్దయవృత్తిని వహించి, నిముసమైన గూర్చుండనీయక యహోరాత్రంబులు గాఢప్రయాణంబులచే నలఁగించి యన్నపానీయంబుల కెడమీయకుండ ధైర్యమునదలించి, దైన్యము గలిగించి, కోపమున నదలించి యేలాగునైన నీతనిచే యబద్ధ మాడింపుము. తెలిసినదా ? (హరిశ్చంద్రునిఁ జూపించుచు) నక్షత్రకా ! ఈతఁడు మనకీయవలసిన రొక్కము నెలదినములలో నిచ్చునఁట ! అందు నొక గవ్వయైన దిగబెట్టక కూర్చుకొని రమ్ము. హరిశ్చంద్రా ! ఈతఁడు పిన్ననాఁటనుండియుఁ గడుగారాబమునఁ బెరిగినవాఁడు. ఆయాసమున కోర్వఁడు. వట్టియలిపిఱికి. ఆకలియైనప్పుడు తిన్నగా నన్నముఁ గూడ నడుగ నేరఁడు. కావున వీని వేగన్నులఁ గనిపెట్టి యన్నపానాదులకు ముప్పూట వేళ దప్పింపక నామాఱుగాఁ జూచుకొనుచుండుము. పొమ్ము.

హరి—దేవా ! సాధ్యమైనంతవఱకు కష్టే చూచుకొనియెద. నా కింక సెల వొసంగుఁడు. నక్షత్రేశ్వరా ! రండు.

విశ్వా—హరిశ్చంద్రా! మఱియొక మాట విని పొమ్ము.

హరి—(ప్రవేశించి) ఏమి సెలవు!

విశ్వా—అయ్యో! వెఱ్ఱిరాజా! నీకేమి పిచ్చియా? నే నిన్నివిధముల బోధించుచుండ నాయంతవాని యుపదేశంబుఁద్రోసివేసి పడరాని యగచాట్లకుఁ దలయొగ్గి పోవుచున్నావే. రాష్ట్రములోఁ గడకు నీ కొక పిడికెడటుకులైన నోరకుండ గట్టికట్టడి చేసెదను. మాయప్పెట్లు తీరునోయీ! నీకీనిష్కారణబాధ యెందులకు? చక్కదనాల చుక్కలగు నా పెంపుడుకూఁతులఁ బెండ్లియాడి యఖండ భూమండలాధిపత్యమంది భోగభాగ్యములఁ దులదూగుచుండుము. అట్లు కాదేని నీవు పడుపాట్లింకఁ గుక్కలుం బడవు.

హరి—గాధినందనా! నే నీకష్టముల నధికముగా భావించుటలేదు. ఇంక నన్నేల బాధించెదరు?

శా. ఆకల్పాంతము నంతముం గనిన స ♦ త్యస్థైర్యపుం గీర్తియే
నాకుం జేకుఱు, నేని నేయిడుములై ♦ సం గోరి జన్మాంత మెం
తో కౌతూహలవృత్తిచే ననుభవిం ♦ తుం జంచల శ్రీసుఖ
ప్రాకట్యం బదియేల? నిశ్చల యశో ♦ వాల్లభ్యమే లేనిచోన్.

విశ్వా—(నవ్వుచు) సరి సరి. ఇనుపగజ్జెల తల్లియగు పెద్దమ్మ కిఱ్ఱు చెప్పులజోడు తొడుగుకొని నీకు ముందు త్రోవ దీయుచుండగా నీవు నా మాట యెట్లు విందువు? ముందుముం దాయరణ్యములలో నెత్తిమాడుచుఁ గాళ్ళనిండ ముండ్లు విరుగ సింహశరభశార్దూలాది ఘోరమృగంబుల భయంకరారవములు విని గుండె ఝల్లన (లోహితుని జూపించి) నీరండ కాలుసేతులు నిలువక లబ్బున మొత్తుకొనుచుండ (చంద్రమతిం జూపుచు) నీనిర్భాగ్యురాలు నీవెంట నీయగచాట్లు పడలేక "అయ్యో! మాలదైవమా! ఈ మాయమగని నాకుఁ గట్టియింత చేటుఁ గట్టితివా" యని గొల్లున నేడ్చి తూర్పాఱం బట్టుచు దుమ్ముతాల్చి నీమొగమునఁ గొట్టినప్పుడు గాని నామాట లిప్పుడు నీకు రుచించవు. రోగికి పథ్యాహారంబు చవియగునె? పొమ్ము. పొమ్ము.

హరి—మాగతి యెట్లయినను గానిండు. మేమికఁ బోవుచున్నాము.

(నిష్క్రమింతురు)

విశ్వా—(స్వగతము) ఆహా! ఈమనోనిశ్చయ మీసత్యవ్రత నిరూఢి యెంత శ్లాఘనీయము! రవంతయైన నా మాయలను జలింపకున్నాఁడే! కాని! ఇంకఁ గావలయు విధాన మాలోచించెద. (నిష్క్రమించును)

ఇది తృతీయాంకము

శ్రీరస్తు

# సత్యహరిశ్చంద్రీయము

## చతుర్థాంకము

[పిమ్మట దీనవదనుఁడై హరిశ్చంద్రుఁడు, వెనుకనుండి చంద్రమతి, లోహితాస్యుఁడును బ్రవేశించుచున్నారు.]

హరి—(స్వగతము) అకటా దుర్గమంబగు నీయరణ్యంబు దాఁటిపోవు టెన్నటికో దైవమా! ఆగర్భశ్రీమంతురాలైన దేవి కెంతటి దురవస్థఁ దెచ్చిపెట్టితిని

గీ. ఘనజఘనభారమున లేత ♦ కౌను గుఁజియ
దీవ్రచండాతపమున మై ♦ తీవ వాడఁ
గనుఁగవ దొరంగు కన్నీటి ♦ కాల్వతోడ
నడువలేక నడువలేక ♦ నడచుచుండె.

చంద్ర—(ప్రవేశించి) నాథా! నాకాయాస మంతకంతకు మిక్కుటమగుచున్నది నేనేమి సేయుదు?

హరి—దేవీ! కుఱ్ఱవానిఁ గొంతసేపు న న్నెత్తుకొననిమ్ము. (తీసికొని) నాయనా నీకెంతటి కష్టము వచ్చెనురా!

లోహి—నాన్నా! మన మింక నెంత దూరము పోవలెను?

హరి—నాన్నా! ఇంక నడచినగాని తెలియదు.

చంద్ర—ప్రాణేశ్వరా! ఇంకను నడువవలయునా?

మానినీవృత్తము: కీరవాణి రాగము - ఆదితాళము

కడుబడలితి నాథా! ♦ కాలు సాగింపఁజాలన్
బడిబడి నడువంగన్ ♦ శ్వాసముల్ దీర్ఘమయ్యెన్
గడుసుదనపు ముండుల్ ♦ గాఁడెఁ బాదంబులందున్
గొడుకు మొదలె సోలెన్ ♦ ఘోరమా నెండచేతన్,

హరి—హా! దేవీ! రాణివాసంపుభోగములనుభవింపవలసిన నిన్నీఘోరారణ్యముల కీడ్చి తెచ్చి కుసుమసుకుమారమైన నీశరీరము నీలాటి దీర్ఘయాత్రలచే నలఁగఁ జేసిన నన్ను నే నేమని నిందించుకొందును? ప్రేయసీ!

సీ. ఏనాఁడు నడచినా ♦ వీ యెడారులలోన
సలలితారామ ♦ సీమలనె కాని
ఏనాఁడు తలసూపి ♦ తీ ప్రచండపుటెండ
కలఘు మాణిక్యకాం ♦ తులకె కాని
ఏనాఁడు చవిచూచి ♦ తీ కందమూలముల్
సరస రాజాన్నభో ♦ జనమె కాని
ఏనాఁడు చెవిఁజేర్చి ♦ తీ క్రూరమృగరుతుల్
లీలాశుకాలాప ♦ పాళిఁ గాని
కటకటా! యెన్నఁడెఱిఁగితు ♦ త్కట దినేశ
ఖర కిరణ జాల తప్త క ♦ ర్కశ శిలాద్రి
కటక గమన శ్రమోద్భూత ♦ చటులచింత
నను వరించుటఁ జేసి యీ ♦ నాఁడె కాని.

చంద్ర—హృదయేశ్వరా! నాకై చింతింపకుఁడు. మీరు మాత్ర మనుభవించుచుండిన సౌఖ్యం బేమి? ధరపైఁ బుట్టొందిన యెట్టి ప్రాణికైనను కొన్ని నాళ్ళు సుఖంబును, గొన్ని నాళ్ళు దుఃఖంబును ననుభవింపక తప్పదుకదా! చూడుఁడు పాప మా నక్షత్రేశ్వరుఁ డీయెండ కెక్కడ పోలెనో? మన మెట్లయినను మం దావటూత్తముని నేమ మరయుటయే యుచితంబు.

హరి—సతీమణీ! ఇట్టి కష్టములయందును బరోపకారము నేమఱకుండిన నీ సౌశీల్య మనన్య సామాన్యంబు. [అతఁడే నక్షత్రకుఁడు వచ్చుచున్నాఁడు. ఇంతలో నిన్నా కురవకవృక్షచ్ఛాయ విశ్రమింపఁజేసి నక్షత్రకుని నక్కడకుఁ దోడి తెచ్చెదను. దేవీ! కొంచెము దూరము నడువుము.

చంద్ర—అయ్యో! బొత్తుగా నడుగు దీసి యడుగు పెట్టుటకు వీలులేకుండఁ బాద ములయందుఁ గంటకములు విఱిఁగినవే! ఎట్లు నడువఁగలను?

హరి—అక్కటా! ఎట్లు నడువఁగలవు?

మ. నవనీలోత్పలతాళవృంతములఁ గాం ♦ తల్ చెంతలన్ వీవ లేఁ
జివురుం గేలొక బాలచూతయిడినిన్ ♦ సేవించుచున్ దోడరాఁ
బువుఁదోఁడన్ నడువ న్నలంగు తలిరుం ♦ బూబోణి వెట్లోర్తు వు
గ్రవనీ దుర్గమ మార్గ కర్కశ శిలా ♦ గాఢప్రయాణ వ్యథల్.

చంద్ర—నాథా! యెల్లకాలం బొక్కరీతి నెవ్వరికి సాగివచ్చును? మెల్లగా నడ
చెదను. (నడచుచున్నది)

హరి—దేవీ! ఆరామభూవిహారసమయంబున దాసికాజనము నీకుం బట్టు క్రొత్త
ముత్తియంపుగొడుగులనీడ నడచు నీకు సౌఖ్యంపుమాట యంతరించెనుగదా?
ఇప్పుడు నీపయ్యెదకొంగె నీకు సకలచ్ఛత్రములు. దేవీ! ఇదే కురవకవృక్షము.
దీనినీడ గొంత విశ్రమింపుము. నాయనా! మీయమ్మకడ కేగుము.

లోహి—నాన్నగారూ! మనవెంట వచ్చిన బ్రాహ్మణుఁడేడీ?

హరి—వచ్చుచున్నాఁడు బాబూ!

[పిమ్మట నక్షత్రకుఁడు కపటశ్రమ నభినయించుచుఁ బ్రవేశించును.]

నక్ష—రాజా! నీప్రయాణము పాడుగాను. మాగురువుగారు నన్ను నీతో నేల బం
పించినాడురా? బాబూ! సొమ్ము పుచ్చుకొనవలసిన యతఁ డాశ్రమమం
దును, జెల్లింపవలసినవాఁడవు నీ విచ్చటను భార్యాపుత్రులతోడ సుఖ
ముగానుండ మీయిరువురిమధ్యను నాసుకండియలాగున(గాళ్ళుపడిపోవునట్లు
తిరుగుటకు నాకర్మమేమి గాలినదయ్యో! రామ! రామ! (కూలబడును)

హరి—నక్షత్రకా! యేమి? యేమి?

నక్ష—ఇంకారేమి! యేమి! యేబెబ్బులియో నన్ను గటుక్కున మ్రింగివేయును.
యీ ఘోరారణ్యములో నన్ను వెనుకం బడ వైచి నీవును నీ యాలుబిడ్డలును
సుఖముగా వచ్చినారుగదా! చాలు; నేనిక్కడఁ జచ్చిన నీకేమి?

హరి—అయ్యో! నేనట్టి ద్రోహిని కాను.

నక్ష— తన్వీవృత్తము: రాగము హిందూస్థానీ కాఫీ - ఆదితాళము

చాలును పో! నీవలనఁ జెడితిరా ♦ చావునకున్ నిను విధ విధియింపన్
బోలు శిలాకంటకములఁ బఱపౌ ♦ ఘోరవనంబుల నను నడిపింపన్
గాళులముండుల్వ్రేఁగినదానదానం ♦ గా బెడుర క్తము మిడిమిడియెండన్
సోలితి నోరెండెను కడుదగ చే ♦ స్రుక్కి నెలుంగిఁక బ్రతుకుగతించెన్.

అయ్యో! మాట గూడఁ బడిపోవుచున్నది.

హరి—నక్షత్రకా ! అల్లదే కురవకవృక్షమునీడకు నిన్ను మెల్లఁగఁ దీసికొనిపోయెద రమ్ము. కొంత యాయాసము తీరును.

నక్ష—ఆఁకలితోఁ జచ్చిపోవువాని కాచెట్టునీడ యెందులకు ? చచ్చిపోవువాఁడ నిక్కడనే చచ్చెదను. (పడిపోవును)

హరి—నక్షత్రకా ! మెల్లగ రమ్ము.

నక్ష—అయ్యా ! మొత్తముమీఁద నీవు నన్ను బ్రతుకనీయవు. ముందు నాకింత నీరు ధారకము పోయవయ్యా ! నాకుఁ జెట్టువద్దు. చేవవద్దు.

హరి—అయ్యా ! ఇక్కడ నెక్కడను నీరు లేదే.

నక్ష—మఱి నన్నిలాంటి యరణ్యమున కేల తెచ్చితివి ?

హరి—అయ్యా ! స్నేహము కుదురక మున్నొక్కని గుణాగుణములవలెనే తోలుత నాకిది నిర్జనస్థలమని తెలిసినదికాదు.

నక్ష—అవును. ఏపెద్దపులినోటనైనఁ బడి యీబ్రహ్మచారి చచ్చినచో మన యప్పడుగువాఁడు లేకుండుగదా యని యెంచి నన్నిచ్చటి కీడ్చి తెచ్చిన మాయోపాయము నీకు బాగుగఁ దెలియునుగాని మఱేదియుఁ దెలియదు.

హరి—అయ్యా ! నిష్ఠురపు మాటలాడకుఁడు.

నక్ష—నిజమాడిన నిష్ఠురమే.

హరి—మహాత్మా ! లేచిరండు. ఇంకెందైన నీరు దొరకునేమో వెదకెద.

నక్ష—అలాగయిన నాచేయి పట్టుకొమ్ము. నాకు బొత్తుగా సత్తువ యుడిగిపోయినది. వాడిపోయిన పెరుగు తోటకూరకాడవలె నున్నాను.

హరి—(నక్షత్రకుని నడిపించి) ఇక్కడఁ గూరుచుండుము.

లోహి—అమ్మా ! నా కీనాఁ డిన్ని మంచినీళ్ళయిన లేవుగా. తల్లీ ! నాకేమో ఆయాసముగా నున్నదే.

చంద్ర—బిడ్డా ! మనకు నేఁడు పెట్టనిదినము వచ్చినది.

హరి—అకటకటా ! సార్వభౌమకుమారునకు నేఁ డన్నోదకములు గఱవయ్యెఁగా అయ్యో ! నేనిప్పు డెంతని చింతింపను ?

శా. శ్రేయోబంధుర సార్వభౌమ పదవి ♦ శ్లేషంబు ప్రాప్తించెఁ బో
యీయుద్యానపరణ్యసుధ్యమునస్యా ♦ మీ ! యన్న మో రామచం
ద్రా! యంచున్ విలపించుచుం బ్రియసుతుం♦ డల్లాడఁగాఁ జూచియున్
సాయం బేమియుఁ జేయలేని గతియే ♦ నన్నేఁచు టే పాపమో ?
దేవీ ! ఎక్కడి సంపద లెక్కడి సౌఖ్యములు ?

మ. తిరమైన సంపదలెల్ల వెంట నొకరీ ♦ తిన్ సాఁగిరావేరి, కే
సరి కేపాటు విధించెనో పథి యవ ♦ శ్య ప్రాప్య, మద్దాని నె
వ్వరు దప్పించెద రున్నవాఁడ నని గ ♦ ర్వాం బేరికిన్ గాదు; కిం
కరుఁడే రాజగు, రాజె కింకరుఁడగున్ ♦ గాలానుకూలంబుగన్.

నక్ష—రాజా ! నీవీ వేదాంతములు చెప్పుచుండుము. నా ప్రాణములు నీప్రయత్న
మక్కఱలేకుండగనే లేచిపోవును.

చంద్ర—నాథా ! ఇప్పుడు దుఃఖమున కవకాశములేదు, కుఱ్ఱవానిగతి యెట్లున్నను
తొలుత నీబ్రహ్మచారి ప్రాణంబులఁ గాపాడుట కర్తవ్యము.

హరి—దేవీ ! నేనెందైనను నీకు దొరకునేమో పోయివత్తును. అంతదనుక నీబ్రహ్మ
చారి సేమం బారయుచుండుము. (నిష్క్రమించును)

నక్ష—ఏమీ ! చంద్రమతీ ! నీపతి యింకను రాలేదుగా ?

చంద్ర—అయ్యా ! బయలుదేఱిన యెడమేది ?

నక్ష—లేదు, లేదు, చచ్చుటకుఁ గూడ నెడములేదు తల్లీ ! నా కాయాసము పుట్టి
నది. మాట బొత్తుగా హీనస్వరము పడిపోవుచున్నది. నేనింక నాల్కఁ పీఁకి
కొని చావవలసినదే. నన్ను జూచి యింత యేడ్చుటకైన మంచపు దొడుగైన
మాయమ్మయైన దగ్గఱ లేకపోయెను. అమ్మా ! నీవీపుత్రదుఃఖ మెట్లనుభవిం
తువు ? రామ ! రామ ! ఇదెక్కడి వడగాలి ! ఓ చంద్రమతీ ! ఇది నా
కోసమే వచ్చుచున్నట్లున్నది, చూడు.

మ. వడగాడ్పుల్ సుడిపాఱుచున్ జురచురన్ ♦ బ్రహ్మాండముంగాల్పగా
దొడఁగెన్ చేటలతోడ నిప్పుకణము ♦ ల్దూర్పాఱగాఁ బట్టుచున్
దడి లేదింతయు నాల్కపైఁగడుపులో ♦ నన్ జిచ్చుముట్టించిన
ట్లడరెన్ మంటలు, బొదినుండవిఁక నా ♦ ప్రాణంబు లీవేదనన్.

(నేలపై బడును)

చంద్ర—నక్షత్రేశ్వరా ! యోర్చికొమ్ము. జరాపీడితయైన నీ తల్లి పుత్రదుఃఖ మను
భవింపకుండునుగాక !

నక్ష—ఏమో తల్లీ ! నాప్రాణాని కెంత కావలయును ? నా కాళ్ళు కదుములు గట్ట
పచ్చిపుండులవలె నున్నవి సరికదా ! చావసిద్ధముగా నున్నదాని కీడునట్లీడ్చు
చున్నవేమి ? ఇది నామరణ చిహ్నమేమో ? అయ్యో ! నే నిప్పుడు బ్రతికి
యున్నానో లేదో ? (ఏడ్చును)

చంద్ర—నక్షత్రేశ్వరా ! స్వయముగా మాట్లాడుచున్నావుకదా ?

లోహి—అమ్మా ! నాకాఁకలి యెక్కువగుచున్నదే తల్లీ !

తోదకవృత్తము : హిందూస్థానీ భైరవి - ఏకతాళము

ఇన్నిదినంబుల ♦ కేమియు నాకీ
వన్నముఁ బెట్టవు ♦ హా ! యిది యేమే ?
కన్నుల సున్నవి ♦ గా యుసురుల్ నే
నెన్నఁ డెఱుంగనె ♦ యీగతి దల్లి !

చంద్ర—అయ్యో ! తండ్రీ ! నీకెంత యవస్థ వచ్చెనురా ! నానావిధ భక్ష్యభోజ్యములం బట్టుకొని పరిచారికాగణం బనేకవిధంబుల లాలించియు బతిమాలియు భుజింపుమని నోటి కందీయ రుచిచూచి చూడని నీవు నేఁడు స్వయముగా "అమ్మా ! అన్నమే" యని యతిదీనత్వమున నన్నడిగినను నీకుఁ బిడికెడన్నం బిడుటకు నాకు గతి చాలకపోయెనే. హా ! దైవమా ! మామూలమున నీ నక్షత్రకునికిఁ గూడ నెంతటి దురవస్థ వచ్చినది ? కరుణామయు లెవ్వరును విపన్నులైన యీపిన్నపాపల రక్షింపరుగా ? హా ! పరమేశ్వరా !

శా. కష్టా ! యెక్కడ లేరె దీనజన ర ♦ క్షాదక్షు లీదుఃఖపు
న్నష్టేటం బడి యేడ్చు నీ నిసువుఁలన్ ♦ గాపాడ ? బుట్టింపవాఁ
డెట్టో పెట్టకమానునా యనెడు ప ♦ ల్కే నిక్కువంబైనచోఁ
బట్టింపఁ డన్నము కాటకంబయి నశిం ♦ పన్ బోలునే మేమిటుల్ ?

[అప్పుడు నాలుగు కల్పవృక్షఫలములు పడును]

లోహి—అమ్మా ! ఇవిగోఁ దీయని పండులు.

చంద్ర—బిడ్డా ! మనకు నేఁడు దైవము ప్రసాదించిన భోజన మిది. నీ వొకటిఁ దీసికొని నక్షత్రకుని కొక్కటిమ్ము.

లోహి—అయ్యా ! దీనినిఁ బుచ్చుకొనుఁడు. (ఇచ్చుచున్నాఁడు)

నక్ష—(స్వగతము) ఆహా ! ఈయమ పతివ్రతాత్వమహిమ యెంత యొప్పుచున్నది ! (ప్రకాశముగా) నాకు మఱి నీరెక్కడ ?

చంద్ర—అదిగో ! సరోవరము. అందు దాహశాంతిఁ జేసికొనుము.

నక్ష—(నీరుత్రాగి వచ్చి) తల్లీ ! చంద్రమతీ ! యెంత పుణ్యాత్మురాలవమ్మా ! చచ్చిపోయినవానిఁ దిరిగి బ్రతికించితివి. నీవు ఫలాహారము జేసినావు కావేమి ?

చంద్ర—నాపతి పుచ్చుకొనకయే నే నెట్లు ఫలాహారము చేయుదును ?

నక్ష—ఓసి వెఱ్ఱిబాగులదానా! ఎక్కడి పతిం గట్టికొంటివి?

మ. ఒక సన్యాసికి సర్వరాజ్యమును నే ♦ దో మాటపట్టింపు మే
రకు చేజాఱిచి; బిడ్డతో నిను మహా ♦ రణ్యంబు పాల్సేసి తూ
టికి నిన్ గుడ్డకుఁ గాని పెన్మిటిని వీ ♦ టిం బుచ్చు కేమంచు న
మ్మిక సేవింతువొ? వెఱ్ఱితల్లీ! కొఱగా ♦ మిన్ గాన లేవింతయున్.

చంద్రమతీ! నీవు బొత్తుగ నమాయకురాలవు. నీవు నాకుఁ బ్రాణదానము చేసినం
దుకు నీకు నే నెక్కువయైనఁ బ్రత్యుపకారము చేయలేను గాని,

మ. సడతీ! నీవిషయంబు మాగురునితో ♦ వాదించి మీరాజ్య మి
ప్పుడ యిప్పించెద రమ్ము, నీమగనితోఁ ♦ బొత్తుండి నల్గొంగులన్
ముడివేయం బనియేమి? నీవ ప్రజలం ♦ బోషింపుమీ; నీకుమా
రుఁడు నీచేతికినైన వెన్క నతఁడా ♦ రోహించు మీగద్దెపై.

అట్లిప్పించు రాజ్యము నీపతికే యిప్పింపు మందువేమో? వట్టి మాయదారివాఁడైన
నీమగనివిషయమై నేఁ జెప్పను. చెప్పినను బ్రయోజనములేదు. రారాజుబిడ్డవు
నీ వీకడగండ్లు పడుటకు నీ కర్మమేమి కాలినదమ్మా. నావెంట రమ్ము.

చంద్ర—నక్షత్రకా! బ్రహ్మచారి చాపల్యమున నీ విట్లాడితివిగాక. ధర్మ మించుక
యైన యోజింపవైతివి. రాజ్యభోగము లనుభవించునప్పుడు పతి పూజ్యుండు
ను, గాలవశంబున నేదేని కష్టము సంప్రాప్తమైనచోఁ ద్యాజ్యుండునా? పత్యను
సరణమే కదా సతీత్వమునకు మూలము. చూడు.

మ. జరుగన్నేరదు దేహయాత్రయును బి ♦ చ్చం బెత్తినన్ గాని, దు
ష్కరిచర్మంబులె కాని పైకిఁ దగువ ♦ స్త్రంబేనియున్ లేదు, కాఁ
పురమా కష్టపువల్లకాట, నిఁక రూ ♦ పుం జెప్పరా, దట్టి మా
దిరిభర్తన్ దనమేనఁ గట్టికొని భ ♦ క్తిన్ గౌరి పూజింపదే.
కావున నీవింక వెడగునుడువుల మానుము.

నక్ష—నీవంటిదానికి హిత ముపదేశించుట నాదియే నేరము. (స్వగతము) మాగురువు
గారు నాకు విధించిన కార్యము నాశక్తివంచన లేకుండ నెఱవేర్పఁ బ్రయ
త్నించుచున్నాను. కాని ప్రయోజన మున్నట్లు తోఁచుటలేదు. అదృశ్యుఁడై
వెంటనంటి మాగురువుగా రిదియంతయుఁ జూచుచునే యున్నారుకదా,

విశ్వా—(ఎవరికిఁ గనఁబడకుండ) నక్షత్రకా! నీయత్నం బొక లోపములేదు. మార్గమధ్యమున వీరి కేయాహారము దొరకకుండ నే మాయఁ బన్నియుండగాఁ గల్పవృక్షఫలము లెక్కడనుండి వచ్చెనో? అల్లనాఁడు సురసభలోఁ దన్ను మాలనాడినందులకు నాకుఁ బ్రతికక్షియై దేవేంద్రుఁడే యీపని చేసియుండవచ్చును. కాని (కోపముతో నాకసమునఁ జూపునిగిడించి) రే! దురాత్మా! ఇంద్రా! నామీఁద నే పంతమునకుఁ గాలు దువ్వుచున్నావుగా!

మ. అపరాధం బొనరించి గౌతమున, క ♦ ట్లాపాదమస్తంబు నీ
వపు వెల్లన్ బెడఁగొట్టుకొంటి, వికఁ వి ♦ శ్వామిత్రుఁడన్ భీతిలే
క ప్రవర్తించెద, వెట్టి బెట్టిదఁపుయో ♦ గంబున్నదో నీకు? శా
పపు నీరందితినేని సాగదిట దే ♦ వత్వంబు గీవత్వమున్.

(ఆలోచించి) అయినను నింద్రుఁడే యీపని చేసియుండెనని యెట్లు చెప్పవచ్చును? పతివ్రతాతిలకంబగు చంద్రమతీదేవికై ప్రకృతియే సహాయము చేయుచున్నదేమో! కానీ! నీటికై పోయిన హరిశ్చంద్రునితోఁ జెప్పి భేతాళవృక్షము కడకు వీరినిఁ జేర్పుమని దంతవక్త్రుని కాజ్ఞాపించితిఁగద! అతఁడే హరిశ్చంద్రుఁడు వచ్చుచున్నాఁడు. ఏమిచేయునో చూచెద.

హరి—(నిట్టూర్పుతో) అకటకటా! మానవున కీదారిద్ర్య దుఃఖము మిక్కిలి దుస్సహముకదా; ఇంతకన్న మరణమే సర్వదా శ్రేయము. ఏలయన.

ఉ. చావును లేమియున్ మనుజ ♦ సంతతికిన్ వ్యసనంబు, లందులోఁ
జావున సంభవించెడు వి ♦ చార మణంగు దినక్రమంబునన్;
జీవున కీ దరిద్రగతి ♦ చే జనియించెడు ఘోరదుఃఖ మో
దైవమ జీవము ల్గలుగు ♦ దాక నశింపక వృద్ధి జెందెడున్:

అయ్యో! నేఁడింత జలపానమునకై నోఁచుకొనకపోయితిమే. ఇంక నక్షత్రకుఁడు బ్రతుకు టెట్లు? లోహితుం డెట్లు జీవించు?

చంద్ర—(ఎదురుబోయి) నాథా! ఆకఁలిదప్పులవలన ముప్పుదొలఁగి నక్షత్రలోహితాస్యులు సురక్షితముగా నున్నారు. మీరును నీఫలముల భుజింపుఁడు. నేఁటికి మీకీఫలాహారమైన లభించినది. (ఇచ్చును)

హరి—దేవీ! యీఫలము లెట్లు వచ్చినవి?

నక్ష—ఎట్లు వచ్చినవా? మాయమ్మ పూర్వపుణ్యమువలన వచ్చినవి.

హరి—నక్షత్రకా ! అట్లే కావచ్చును. (చంద్రమతితో) దేవీ ! నాకు నాఁకలి దప్పులడఁగినవి కాని మనము నేఁటిరేయి నిదురింప నొక వటవృక్ష మిక్కడనే యున్నది. దాని నొక మునీశ్వరునివలన నెఱిఁగితిని.

నక్ష—వాఁడే దంతవక్త్రుఁడు కాఁబోలు ! ఇఁక నెట్లయిన వీరి నక్కడకుఁ జేర్ప వలయు. (ప్రకాశముగా) అలాగైన హరిశ్చంద్రా ! చీఁకటి పడకమునుపే అచ్చటికిఁ జేరుట మంచిది. నాకిప్పుడే నిద్ర తూఁగివచ్చుచున్నది.

హరి—పోదము రండు. (కుఱ్ఱవాని నెత్తుకొని నడచుచున్నాఁడు)

చంద్ర—(నడచుచు) వటవృక్షమింకెంత దవ్వున నున్నది ?

హరి—దేవీ ! అదిగో ! చూడుము.

ఉ. వాడిన పండుటాకు లిల ♦ పైఁ బవనాహతి రాలుచుండె నో
చేడియ ! గబ్బిలమ్ములు వి ♦ చిత్రముగాఁ దల క్రిందులౌచు వ్రే
లాడెడుఁ గొమ్మలన్ శిశువు ♦ లన్ దమపొట్టల క్రింద నూఁదుకొం
చూడలపై విలాసముగ ♦ నుయ్యేల లూఁగెడి క్రోతిపాళెముల్.

నక్షత్రకా ! ఈవటరాజంబుఁ దన నీడచే భూతకోటినిఁ జక్కగాఁ బోషించుచున్నదికదా !

నక్ష—ఏమోయీ రాజా ! నన్ను భూతాశ్రమస్థలంబునకుఁ దీసికొనివచ్చితివా ఏమి?

హరి—కాదు కాదు మనకు నివాసయోగ్యమైన చోటికే. దేవీ ! శయనయోగ్యములుగా నిచట నెలవులు బాగుచేసికొనుట మంచిది. చీఁకటి యప్పుడే కను మూసికొనివచ్చుచున్నది.

చంద్ర—(బాగుచేసి) నాయనా ! లోహితా ! యిచ్చటఁ బండుకొమ్ము.

(అందఱు శయనింతురు)

హరి—(లేచి) అక్కటా ! కాలాంజన మందినట్లు బ్రహ్మాండ మంతయు నంధకార బంధురమై యెంత భయంకరముగా నున్నది ? మార్గాయాసముచే గాఢనిద్రావస్థయందున్న వీని కేయిక్కట్లు రాకుండ రక్షింపవలయునుగదా ! (చంద్రమతిం జూచి) అయ్యో ! సార్వభౌముని యిల్లాలికా యిన్ని కడగండ్లు ? నే నెంత దైర్య మవలంబింత మన్నను శుష్కోపవాసకృశయై నూదిరాలపైఁ బయ్యెదకొంగు పఱచుకొని పండుకొనియున్న యీదేవిం జూచినప్పుడెల్ల నాహృదయంబు మఱింత దుఃఖసంకులం బగుచున్నది ? హా ! ప్రాణపతీ ! నీకు నేఁడిన్ని కందమూలములేవియు లేకపోయెఁగదా ! హా ! దేవీ ! అసూర్యంపశ్య ! ఆపాడు వేఁటకు బయలుదేఱిననాఁటితోడనే నీకును నీసౌఖ్యంబులకును ఋణము దీఱెనే ?

సీ. ఆరామవనసీమ ♦ యారామ ! నీకు నీ
ఘోరవల్మీక కాం ♦ తారసీమ ?
తతహంసతూలికా ♦ తల్పం బౌనో నీకుఁ
గలికి ! యీ మొఱసరా ♦ కటికి నేల ?
చెలికత్తియల మేలు ♦ కొలుపుపాటలె నీకుఁ
నారి యీ క్రూరమృగా ♦ రవములు
అలరుఁ దేనియతో ఫలా ♦ హారమా నీకుఁ
జవిలేని యీ వేఁడి చవిటినీరు

పూత సరయూనదీసమా ♦ యాత మంద
వాతపోతాభిగమ్య సు ♦ వర్ణ సౌధ
తలమణీడోలికాసౌఖ్య ♦ కలన లేక
నిదురగాంచితి కటికిరా ♦ నేల నేఁడు.

హా ! సుతా ! లోహితా ! నీవెంతటి యదృష్టహీనుండవైతివి తండ్రీ !

మ. అడుగెన్నండిడనీక నేలపయి, న ♦ ట్లల్లారు ముద్దారఁగా
నుడిగంపుం జెలిపిండు క్రొంబసిడి మే ♦ లుయ్యాల లందుంచి పో
రడుగన్ "జోఇనవంశమౌక్తికమణీ !♦జో లోహితా" యన్న సం
దడి గన్మూసెడు నీకు నెట్లమరెని ♦ ద్రాసౌఖ్య మీ ఱాలపై ?

[అప్పుడు తెఱలోపలఁ గలకలారవము]

(ఆకర్ణించి) ఏమిది ? వటవృక్షసంచలమైనది ? మఱేమి యుపద్రవము లేదుకదా !

[పిమ్మట సపరివారుఁడైన భేతాళుఁడు ప్రవేశించుచున్నాఁడు]

ఓరీ ! యెవఁడురా ? త్రిలోకభీకరంబగు మదీయ భేతాళవృక్షోపాంతమున నిర్భయముగా సంచరించుచున్నాఁడు ?

శా. అత్యుగ్రుడన్ నను వేడ కీ వటతరు ♦ ప్రాంతంబునన్ రాఁడు ఫా
లాక్షుం డేని, సదాధమా ! తెలియవే ♦ రా నన్ను భేతాళునిన్ ?
వక్షంబున్ విదళించి, పీల్చుచుఁగవో ♦ ష్ణంబైన క్రొన్నెత్తురుల్
భక్షింతున్ రుచులూర నీపలలమున్ ♦ భక్ష్యోపభోజ్యక్రియన్.

పరిజనము—అరే, వీని కండలు భక్షింపుఁడు. పొడువుఁడు.

హరి—(స్వగతము) వీనికి నిద్రాభంగము కలుగకుండ నా గుర్మార్గుల నేనే సమీపించి వధించుట మేలు. (సమీపించి) రే! దురాత్మా! భేతాళా! యీయావటం బాశ్రయించియుండి నీవు చేయు దౌర్మార్గ్యం బిదియా! కాని యింకఁ ద్రుళ్ళకుము.

భేతా—ఓరా! ఎవఁడవురా! నిర్భయముగా నాకె యెదురు పల్కుచున్నావు? (మీఁది కురుకును)

హరి—రే! దుష్టా! లోకకంటకా!

మహాస్రగ్ధర

పటు మద్దోశ్చంహాసో ♦ త్పతనమున భవ ♦ త్ప్రాణము ల్లేచు, నేత
ద్వటవృక్షోపాంతభూమిన్ ♦ వ్యపగతభయులై ♦ పాంథకోటుల్చరింపన్
గుటిలాకాలానుభూతిన్ ♦ గువలయ పతితన్ ♦ గోలుపో నైజమానా
చటులహాత్రోగ్రశౌర్య ♦ చనవిమెటులహరి ♦ శ్చంద్రువీడున్ దురాత్మా!

(జుట్టుపట్టి యవ్వలి కీడ్చుకొనిపోవును)

భేతా—అయ్యో! చచ్చితి! చచ్చితి! పరిజనులారా! రండు. రండు.

పరిజనులు—నెచ్చెలులారా! మనమిక్కడున్న చావుదప్పదు. రండు పాఱిపోదము.

(పాఱిపోవుదురు)

నక్ష—(అదరిపడి లేచి) ఓ చంద్రమతీ! ఓరీ దుష్టా! లోహితా! లెండు. మనము నిష్కారణముగాఁ జావవలసిన యోగము వచ్చినది.

చంద్ర—అయ్యో! ఏమి యప్రియము సంభవించినది?

నక్ష—ఏమి యప్రియమో తల్లీ! ఈ మఱ్ఱియూడలను పెనుభూతము లనేకములు గుభిల్లుగుభిల్లుమని దుముకుచు నామీఁదఁ బడి యిదిగో యీవైపునకుఁ బరువెత్తినవి. అందులో నొక పెద్ద దయ్యము ను నీపతియుం బెనగులాడుచు నీ వంక కేగెరి.

[తెరలోపల]

గీ. విపుల దోర్గర్వమున జాల ♦ విఱ్ఱవీఁగి
తుది హరిశ్చంద్రుచే నిహ ♦ తుండవైతె?
పాంథనిర్మూలనోద్యోగ ♦ పాపఫలము
కట్టి కుడుపక విడుచునా? ♦ కఠినకర్మ!

చంద్ర—నక్షత్రకా ! మన కష్టాయము తొలంగినది. నాపతి భూతాధమని గర్వ మడంచి వచ్చుచున్నారు.

విశ్వా—(స్వగతము) ఆహా ! ఇతఁ డన్నిట సమర్థుఁడు. ఇంక నితని సాధించుట నాతరముకాదు. కాని, నాశక్తియంతయు నీతనికై ధారపోసెద. (నక్షత్రకుని సైగఁజేసి నిలిచి) శిష్యా ! వీరి నిక్కడ నుండనీక ప్రయాణము సాగించుము. పిమ్మట గావింపవలసిన విధానము నాలోచించెద.

నక్ష—అలాగుననే.

హరి—(ప్రవేశించి) దేవీ ! నక్షత్రకా ! మీకు నిద్రాభంగము గలిగినదా ?

చంద్ర—నాథా ! మానిద్రాభంగముతోఁ బాటు శత్రుగర్వభంగము గూడ గలిగి మీరు కుశలముగా నున్నారుగదా !

హరి—దేవీ ! ధర్మదేవతవైన నీవు నా చెంతనుండ నా కుశలమున కేమి కొని నక్షత్రకా ! మనమింక నిశ్చింతతో నిద్రపోవచ్చును. ఇంకను నొక జాము రేయి యున్నట్లున్నది.

నక్ష—ఏమనుచున్నావు ! నీకు మతి పోయినదాయేమి ? నన్నిచ్చట నింకను బండు కొమ్మనుచున్నావా ?

మ. బ్రతుకు కాశింబచినవాఁ డెవండు విను డీ ♦ వాక్యంబు, నేపాటి గం
డతనం బున్నను నిట్టిదయ్యములతో ♦ నా నీకుఁ జెల్లాట ? మొం
డితనంబున్ గడబెట్టి వే కదలు ♦ మట్టే ప్రజ్ఞకై పెన్గులా
డితివా యిందతిచావు నీవలన నేఁ ♦ డే మూఁడు నిక్కంబుగన్.

ఇంక నీమాటలు చాలించి బయలుదేఱుము.

హరి—అయ్యో ! ఇంకను మీకుఁ బిశాచభయ మెందులకు ? వాఁడు నాచేఁ గడ దేఱినాఁడుగదా !

నక్ష—వానిపరివారములోఁ గొన్ని మైమఱచి నిదురించుచున్న నాయెదుటొమ్ముపై దుమికినవి. అవి యేమయ్యెననుకొంటివి ? అప్పుడు బండిచక్రముక్రింద నలిగిన మొండిబండపురుగులాగున నెత్తురు గ్రక్కుచుఁ జచ్చిపోవలసినదే. ఇప్పుడు మీతో వేళ కన్నములేక యెంత చిక్కి యున్నను మాయాశ్రమములో నెల్లప్పుడు ఘృతసూపములతోఁ బెఱిగిన మొండిప్రాణిని గావున ఱొమ్ముపై నెక్కి భూతములు తాండవమాడినను జావక బ్రతికియున్నాను.

హరి—నక్షత్రకా ! నీ కీపిఱికితన మెక్కడనుండి వచ్చినది ?

నక్ష—అది బ్రాహ్మణులకు సహజమని తెలిసియుండియు మాటిమాటికి నన్నేల యెగతాళి చేసెదవు ? నీ వేమన్నను నన్ను నాపితికితనమే రక్షించుచున్నది. కాని నేను నీమాట విని యిక్కడ నుండను.

హరి—అయ్యా ! యీగాఢాంధకారమున నెక్కడకుఁ బోగలవయ్యా !

నక్ష—ఓరీ ! మాయావీ ! నీవింతకు నిక్కడనుండి కదలవురా ? ఓ బాబూ ! నేను నీతో నేల వచ్చితినిరా. కాని.—

ఉ. కుత్తుకబంటి యన్నమున ♦ కుం జెడి, నాకరకాసు రాని యీ
తొత్తఱికంపుఁ బెత్తనము ♦ తో నినుఁ గానల వెంబడించు నా
మెత్తదనాని కేడ్చుచును ♦ మేను దొఱంగెదఁగాక, యింక నా
యెత్తుధనంబు వోసినను ♦ నేనిట నుండ నిమేష మేమియున్.

హరి—అయ్యా ! ఏల మీ కీ మరణభయము ?

క. రానలసియున్నఁ దప్పనె
చావెచ్చట డాఁగియున్న ♦ జంతువులకు ? ధా
యీ వైఖరి వెనువెంటనె
యేవేళను గాచియుండు మృ ♦ త్యువు విప్రా !

నక్ష—ఇప్పు డీవేదాంతప్రసంగములు జరుగుచుండగాఁ బిట్టపోరు బిట్టపోరు పిల్లి దీర్చినట్లు నన్నేదో యొకదయ్యము నోటవేసికొనక మానదు. (భయ మభినయించి) అదిగో నేనన్నంతయైనది. రాజా ! చచ్చితినోయీ ! అవంక నొక దయ్యము గ్రుడ్లుఱుముచు నాపైకి వచ్చుచున్నది. దానికి బ్రాహ్మణ దేహ మాంసమే రుచి కాఁబోలు !

హరి—అయ్యా ! అది మిణుగురుపుర్వు కాని దయ్యముగాదు. అన్నియుఁ దెలిసిన నీకుఁ బ్రాణములపై నింతటి యాస కూడదు.

నక్ష—నీవు బ్రహ్మవేత్తవు కాఁబోలు. ఇట్టివాఁడ విప్పుడు కొఱచిచ్చు వచ్చి కాళ్ళకుఁ జుట్టుకొన్న నీప్రాణరక్షణమునకై ప్రయత్నింతువా ? లేదా ?

హరి—మనప్రయత్నముల ఫలాఫలములు విధి కనుకూలములై యుండు.

నక్ష—అయ్యో ! దైవమా ! ఈనల్లకాటి యరణ్యములో నీదయ్యాలవాతఁ బడుమని నానొసట నేల వ్రాసితివి ? నేనింక నాలుకఁ పీకికొని చచ్చెదను. అమ్మా నిన్నింక నేఁ జూడను. (నేలఁ బడును)

హరి—నక్షత్రకా ! బయలుదేఱుము. దేవీ ! రమ్ము. (నడచుచున్నారు)

నక్ష—గట్టునఁ బడితిని.

చంద్ర—నాథా! యెక్కడి దావాలుతురు?

నక్ష—ఏదైన కొఱవిదయ్యము మనవెంటఁ బడినదేమో చూడుఁడు. దయ్యముల మూఁతు లెఱ్ఱగా నుండునని మాయమ్మ చెప్పుచుండును.

హరి—కాదుకాదు. ఈయడవి యెక్కడనో కాలుచున్నది.

నక్ష—మనలఁగూడ దహింపదుగదా!

చంద్ర—నాథా! మనము దవాగ్నిమధ్యమున వచ్చినారము.

హరి—కటకటా! యీదావానలం బెంత భీషణముగా మండుచున్నది!

మ. వియదుద్ధ్వాంత నితాంత ధూమ పటలీ ♦ విస్తారితధ్వాంతమై
భయదావన్మృగమై, నగాగ్రనిపత ♦ ద్వ్యాఘాల కాకోలమై
అయుతార్చిస్స్ఫుటితోరు కీచక నినా ♦ దాభీలమై కీలి, హా!
లయకాలోగ్ర జటాలవల్లక కరా ♦ ళంబై వనం బేర్చెడున్.

లోహి—తండ్రీ! ఈమంటలు నామీఁదికే వచ్చుచున్నవి.

హరి—అయ్యో! యేది యెటులున్నను మునిఋణము దీర్పకయే యీదావానలంబునఁ బడి చావవలసివచ్చెను. నక్షత్రకా! నీగతి యేమి?

ద్విపద: హిందూస్థానీ భైరవి - ఆదితాళము.

చంద్ర—మతిమంత! నక్షత్ర! ♦ మానిమిత్తమున
గతియింపవలసె నీ ♦ కానలలో నేఁడు

హరి— వనితరో! యీఘోర ♦ పాపంబు గూడ
కనులఁ జూడక ముందుఁ ♦ గార్చిచ్చునందుఁ
బడి సమర్పింతు నా ♦ ప్రాణాహుతులను
పడతి! యంతట శాంత ♦ పడునేమొ యగ్ని.

చంద్ర—హా! దయాగుణసాంద్ర! ♦ హా! హరిశ్చంద్ర!
సిద్ధాన్న నను పీడ ♦ నే నెందు బోదు?

హరి— కొడుకుతో నక్షత్ర ♦ కుని నెట్టులైన
జడదారి కిచ్చినె ♦ చ్చటనైన బ్రతుకు;

చంద్ర—ఇట్టులైన మునిబుణం ♦ బెటు దీఱునయ్య
కటకటా ? నేనెట్లు ♦ గా దీర్పఁగలను ?
అకలుషంబగు సత్య ♦ మమరు మీఱున్న
సకలధర్మంబులు ♦ సాఁగు మీఱున్న
పనికిమాలిన నాదు ♦ బ్రతుకేమి సెక్కు—
చననిండు పదివేల ♦ జన్మాలకైన
నీవె నాపతిగాఁగ ♦ నిటలాక్షు వేఁడి
పావకునకు నిచ్చి ♦ వైతు నాథనువు.

(అని అగ్ని కెదురుగాఁ బోవుచున్నది)

లోహి—వలదమ్మ నీ వేగ ♦ వలదమ్మ తల్లీ !
యిల నాదు బ్రతుకేమి ♦ హీతనున్న ! మీకు.

చంద్ర—నాయనా ! నీవు నాతోఁ గూడ రావలదు. నీతండ్రిగారియొద్దకుఁబొమ్ము.

(అగ్ని కభిముఖముగాఁ బ్రాంజలియై)

## దండకము

శ్రీమన్మహాయజ్ఞమూర్తీ ! జగజ్జాలరక్షా ! ద్వీపల్లోకశిక్షా ! దురాలోక తేజోవిరాజీ ! కృపాళూ ! భవద్దివ్యచారిత్ర మెన్నంగ నే నెంతదానన్ సురారాధ్య ! నీయందు వేదంబులున్ నాల్గుజన్మించుటం జేసి వేల్పుల్ నినున్ జాతవేదేతి నామంబులన్ భక్తిఁ బూజింత్రు, నీచేత శిష్టాళికర్మంబులెల్లం బ్రవర్తించు దేవా ! నినున్ రాజసూయాది యజ్ఞంబులందున్ బ్రబూజించియున్నట్టి మమ్ముం గృపన్ బ్రోవఁగా! జెల్లునే కాని బాధింపఁగా న్యాయమయ్యా ! యిదే పాడియయ్యా ! దయాభంగి యేమయ్యె నయ్యా ! నిను న్నమ్మి యున్నారమయ్యా, యరణ్యంబులన్ దిక్కులేకుండ నల్లాడు నీదీనులన్ గాల్ప నీకెట్టులౌనో విచారింతు, నేనే లసన్నిత్యవ్రతారాధ్యుఁడౌ శ్రీహరిశ్చంద్రభూపాలు నిల్లాలినే యైతినేనిన్, బ్రశస్తోరు సాధ్వీత్వమే నాకు వర్తించునేనిన్,

నిమిషంబులోనన్ భవజ్జ్వాలికాజాలముం బాసి శాంతుండవై నవ్య నీహారవారిపూరముం బోలి శైత్యంబునం గ్రాలవే వీతిహోత్రా! మునిస్తోత్రపాత్రా! నమస్తేనమస్తేనమస్తే నమః. (అగ్ని చల్లారును)

విశ్వా—(స్వగతము) ఆహా! ఆ పతివ్రతామతల్లి ప్రభావంబునను మా మహిమంబు లెంకకుం గొఱగాకున్నవే. కాని వీరింకం గాశీపట్టణమునకే చేరుదురు. అప్పటివిధానం బాలోచింతు. (నిష్క్రమించును)

నక్ష—హరిశ్చంద్రా! నీవింక బయలుదేఱుము.

లోహి—అమ్మా! అమ్మా! వచ్చితివా? (కౌఁగిలించుకొనును)

హరి—దేవీ! నీవలనఁగదా మేమందఱము బ్రతుకగలిగితిమి.

చంద్ర—నాథా! మీసత్యరూఢివలన మనమందఱము బ్రతికితిమి.

నక్ష—ఇంకపైన మీముచ్చటలు చాలించి తిరిగి యేదేని నుపద్రవము రాకమున్నె బయలుదేఱుఁడు. నడచినకొలఁది కాశి మనకు దూరమై పోవుచున్నది.

హరి—నక్షత్రకా! గంగానదీఘోషము వినంబడుచున్నది. వినుము.

మ. హరిపాదోద్భవనోట నాంజలమునం ♦ దాప్లావముం జేసినన్
కేలుపంకంబులడంగు మీకనుచు నా ♦ ఘోషించెడు జూడు బం
ధుర గంధాచల గంధవాహ విచలో ♦ త్తుంగోర్మిజాలేత రే
తరసంఘట్టన జాయమాన తతరో ♦ దఃక్రాంత ఘోరార్భటిన్.

నక్ష—అది ఎంతదూరమైన నట్లు వినఁబడుచుండును.

హరి—అదిగో! విశ్వేశ్వర దేవాలయగోపురము చూడు.

మ. వినువీధిన్ మినుకంచుఁ గన్పడు నదే ♦ విశ్వేశ దేవాలయా
గ్రనిబద్ధోన్నత గోపురాగ్ర విలస ♦ ద్గాంగేయశృంగంబు సు
మ్మ! నటద్భీమ జటావిటంక విలుఠ ♦ న్మందాకినీ నిమ్నగా
కనకాంభోజపు మిద్దెయో యనఁ బ్రభా ♦ క్రాంతాఖిలాశాంతమై.

నక్ష—అట్లయినఁ దొందరగా నడువుము. (అందఱు నడచుచున్నారు)

హరి—దేవీ! రమ్ము. (నిష్క్రమింతురు.)

ఇది చతుర్థాంకము

శ్రీరస్తు

# సత్యహరిశ్చంద్రీయము

## పంచమాంకము

[సతీసుతులతో హరిశ్చంద్రుఁడు నక్షత్రకుఁడు ప్రవేశించుచున్నారు]

హరి—దేవీ! కష్టము లెట్లున్నను బుణ్యక్షేత్రమైన వారణాసి దర్శించితిమి. చూడు.

గీ. భక్తయోగపదన్యాసి ♦ వారణాసి
భవదురితశాత్రవఖరాసి ♦ వారణాసి
స్వర్ణదీతటసంభాసి ♦ వారణాసి
పావనక్షేత్రముల వాసి ♦ వారణాసి.

నక్షత్రకా! విశ్వేశ్వరు దర్శించి వత్తము. దేవీ! రమ్ము.

నక్ష—ఇఁక మాయప్పమాట నీకుఁ దోఁచదు. పద. (నడచుచున్నారు)

[యవనిక నెత్తగా దేవాలయము కాన్పించును. అందఱు విశ్వేశ్వరునకు నమస్కరింతురు]

హరి—(ప్రాంజలియై)

శ్లో. ప్రభుస్త్వం దీనానాం ఖలు పరమబంధుః పశుపతే!
ప్రముఖ్యోఽహం తేషామపి కిముత బంధుత్వమనయోః
త్వయైవ క్షంతవ్యా శ్శివ! మదపరాధాశ్చ సకలాః
ప్రయత్నాత్కర్తవ్యం మదవన మియం బంధుసరణిః.

శా. ఆపద్బంధుఁడవీవు స్వామివిగదా! ♦ యాలాటి యాపన్నులం
దేపారన్ బ్రముఖుండఁగా; మనకుఁ దం ♦ డ్రీ! బాంధవంబింక
వేఱేపల్కం బనిలేదు; గాన నిఁక నీ ♦ వేసైచి నానేరముల్
కాపాడందగు నెట్టులైన; నిటులే ♦ కాయోగ్యబంధుత్వముల్

సత్య—హరిశ్చంద్రా ! ఇంక నెంతకాలమిట్లు మముఁ బట్టుకొని కూర్చుండెదవు? రమ్ము.

చ. అలయక కుక్కుటగోపురము ♦ లన్నియుఁ జూచుచు నప్పుమాట యో
తలఁపవు; చేసిన యప్పు నాకగు ♦ హా గిరువంచు రవంత యేని, లోఁ
దలఁపవు; నా ప్రయాసము వృ ♦ ధాయగుచున్నది; నెల్ల బెట్టుమా
పెలుచన మా ఋణంబు నెగ ♦ వేయదలంచిన నేను బోయెదన్.

హరి—అయ్యా ! యెగవేయవలయునన్న నింత కష్టమున కేల యోర్చితి ? తొందర పడకుము.

సత్య—ఏమీ ! సామ్ము యెగదలఁచినవాఁడవు నీవు తొందరపడకపోఁగా బుచ్చుకోవలసిన నన్నుఁ గూడఁ దొందరపడవలదని నీతులు చెప్పుచున్నావుగా ? బాగు ! అన్నింటికిఁ గాళ్ళు సాఁచిన నీకేమి తొందర ?

ఉ. పుట్టెను నప్పు నీకు నొడఁ దల ♦ మున్గితి, వింకొక పుట్టెనైన నీ
పుట్టి మునుంగ చింతయును ♦ బ్రొద్దున నీమొగమింత సూచినన్
బుట్టదయన్నమున్ మునిగి ♦ పోక యింకేమిటి ? దీప ముండఁగా
నెట్టన జక్కఁ బెట్టుకొన ♦ నేరకపోయె గురుండు వెఱ్ఱియై.

హరి—అయ్యా ! నిష్ఠురములాడకుము.

సత్య—ఏమీ ! మాకు రావలసిన సొమ్ము మేమడుగుట నిష్ఠురమాయెనుగా? నీవడుగుకొన్న నలువది దినంబులు నేఁటితోఁ దీఱుచున్నవే. ఇంతదనుక నాకిచ్చిన దొక్క కాసైన లేదే ? ఇంక నీవిచ్చెదనని మా కెట్లు నమ్మకముండును ? ఇప్పుడు మాత్రము.

శా. ఏలీలన్ సవరింతువో మా ఋణము ? కొం ♦ పే గోడియో, నింతకూ
డే లే; దేమిటి కింకఁ జంపెదవు పో ♦ మ్మో మీకు నేనాఁటి బా
కీ లన్నిన్నినుఁ గొట్టువాఁడెవఁడు? చి ♦ క్కెన్నికు మా జుట్టు; ప
త్రాలా? సాక్ష్యములా? నినున్ బలిమిమీఁ ♦ ద న్రచ్చకీడ్పింపగన్.

హరి—నక్షత్రకా ! పత్రములు సాక్ష్యములు నేల కావలయు ? నిత్యస్థిరంబయిన నావాక్కున కన్యథాత్వ మెప్పటికైనా సంభవింపదుగదా !

సత్య—సంభవింపక నిప్పటికిఁ జేసిన దేమున్నది ?

హరి—అయ్యా ! నాదీనదశ యించుక యోచింపుము.

సత్య—అలాగయిన నేను యోజించి చెప్పునది గట్టిగా వినుము.

శా. నీకాంతం డది యప్పువెట్టినది శా ♦ నే కాద, యూహూని ని
న్నేరికై సాఁచి మఖార్థ మిమ్మనిన సా ♦ మ్మే కాని; యుద్దానికై

నీకన్నుంగవ నమ్ముచు నిల్చి యిట ము ♦ న్నే రాజ్యసర్వస్వముం
జేకొన్నాఁ డిఁక నేటియప్పు? నిజముం ♦ జింతింప నింతేకదా?

హరి—ఇంతేయె కాని— నెలదినములలోని చ్చెదననియమ్మునితో నొప్పుకొంటిని గదా!

నక్ష—లేదనిన నామాటలన్నియు సున్నయగుంగాదె?

హరి—అయ్యా! సత్యేతరంబునకు నామానసం బొప్పదయ్యా!

నక్ష—ఆహా! అమాయకుఁడా! ఇంతలోఁ జెడ్డప్పుడు గూడ సత్యము సత్యమని యూఁగులాడుచున్నావే? హరిశ్చంద్రా! నీ వేమనుకున్నను

మ. జటిసై నేననరాదు కాని విను నీ ♦ సత్యంబె నీకొంప కిం
తటి చేటొదవ మూలమిప్పటికి నై ♦ నన్ మించిపోలేదు; తీ
ర్పుటకే నాఁటిఋణంబు మీకనినఁ దీ♦ఱు న్నిక మాబాధ; యం
తట నూరేగుము సత్తుచిత్తనుచుఁ జం ♦ తన్ బాపి బైరాగివై.

అట్లు కానిచో నింతధనము నీవిప్పట్టున నెట్లార్జించెదవు? చెప్పుము.

సీ. వైదికవృత్తి సం ♦ పాదింతు నంటివా
యడుగను రాచపో ♦ కడలు నీకు
రాచరికంపు శౌ ♦ ర్యమునఁ జెత్తువటన్న
దెసమాలి యేవంక ♦ దిక్కు లేదు
వణిజవర్తనముచే ♦ గణియింతు నంటివా
యరచేతి గ్రుడ్డిగ ♦ వ్వైన లేదు
వ్యవసాయవృత్తిచే ♦ నవరింతు నంటివా
లేదు భూవసతి గో ♦ ష్పాదమంత
ఇందు నేదేని వ్యాపార ♦ మందదగిన
యంత పున్నెంబు పుట్టిన ♦ నింతధనము
గంటుకట్టునె యీస్వల్ప ♦ కాలమునను
గడచు నీనాఁటితోడ మా ♦ గడువుదినము.

ఇవి యేవియుఁ గాక జానిసవృత్తికిఁ బాల్పడినను నిన్నెవరు కొనువారు లేరు. కావున నాయుపదేశవాక్యముల ననుసరించి నీఋణబాధ తప్పించుకొనుము. మాగురువుగారితో నీదురవస్థయంతయుఁ జెప్పి యీసొమ్ము వదలివేయ దెలుఁగొన రింతాద, చెప్పుము ఏల నీ [illegible]

హరి—నక్షత్రకా! నాకంఠముఁ గత్తిరించుచున్నను నసత్య మాడుటకు నా మనం బొప్పదు.

నక్ష—హరిశ్చంద్రా! నీమేలుగోరి నేనింత వచించెద వినుము.

ఉ. పుట్టిననాఁటనుండియును ♦ బొంకియెఱుంగవ; యేనెఱుంగు ది
ప్పట్టునఁ గూడులేని దుగ ♦ వస్థల నుంటివిగాన నీమనం
బెట్టటొ తెంపుజేసికొని ♦ యీయుపదేశము నాలకింపు, మే
నొట్టిడుకొం దసత్యమున ♦ కొప్పితినంచు వచింప నేరికిన్.

చంద్ర—నక్షత్రేశ్వరా! నీవంటి మునికుమారుఁడు చెప్పవలసిన నీతులా యివి?

నక్ష—చంద్రమతీ! నీవును నీపెన్మిటికిం దగినట్టు దొరికినావు పో.

శా. మీానిప్పచ్చరముం దలంచి కరుణన్ ♦ మీాబాగుకై యింతగా
నేనేమో హితమున్ వచించితిని; మీా ♦ కే లేని యీబాధ నా
కా? నీపెన్మిటి నీ వెఱ్ఱైన విను నా ♦ కౌనేమి; పోనేమి
స్నానంబో జపమో తపంబొ సదను ♦ ష్ఠానంబొ యోజింపుమా.

చంద్రమతీ! నానీతులు మీారు విననక్కఱలేదు. ఊరక యడ్డపుల్లలు వేసినట్లు కాదు. మాకు రావలసిన సొమ్ము గవ్వలతోఁ గూడ లెక్కపెట్టి మా కిప్పింపుము. నేనింక క్షణమాగను. మీామీాఁది మోమోటముచే నేనీంకను నాలస్యము చేసినచో సహజముగా ముక్కోపియైన మాగురువుగారు నాగొంతు గోయకక మానరు. హరిశ్చంద్రా! నీపెద్దఱికం బాలోచింపను. మాసొమ్ము గుమ్మరించి మఱి నడువుము.

(చేయి పట్టుకొని నిలవేయుచున్నాడు)

హరి—(నిట్టూర్పు విడిచి) దేవీ! ఈఋణబాధ కడుంగడు దుర్భరముగద! చూడు.

మ. సరివారి న్నగుబాటు, పిమ్మట మన ♦ శ్చాంచల్యరోగం, బనం
తర మాహారమునం దనిష్టమటుమీాఁ ♦ దన్ దేహజాడ్యంబటన్
మరణంబే శరణంబు, పెక్కుదినము ♦ ల్మంచాన జీర్ణించి, యిం
తిరో! యీప్రాణులకున్ ఋణవ్యథలకం ♦ టెన్ దుస్సహంబేదికిన్

దేవీ! మందభాగ్యుఁడనైన నే నిప్పుడేమి చేయుదును? నిరవశేషముగా ఋణము దీర్చివేసికొని సంతోషించు భాగ్యము లేకపోయెనే!

చంద్ర—నాథా! మీారిప్పట్టున ధైర్యము వహించి నామనవి యాలింపుఁడు.

గీ. కాలగతి సర్వసంపద ♦ లోలుపోవ
మిగులు సిరి నాకు మీారును ♦ మీాకు నేనె

బానిసగ నన్ను నే కల ♦ వాని కేని
నమ్ముకొనుఁ డింక మాని ఋ ♦ ణమ్ము దీఱు.

హరి.—హా ! విధీ ! ఈ హరిశ్చంద్రునకు నెంతటి యవస్థ దెచ్చితివి ?

ఉ. అంతటి రాజచంద్రునకు ♦ నాత్మజనై, కకుబంత కాంత వి
క్రాంతయశోవిశాలుని త్రి ♦ శంకు నృపాలుని యిల్లు సొచ్చి, భా
స్వంతకుల ప్రసిద్ధి కొక ♦ వన్నె ఘటించిన గేస్తురాండ్ర మే
ల్బంతిని నిన్ను నొక్కనికి ♦ బానిసగాఁ దెగనమ్మికొందు నే ?

చంద్ర—ప్రాణేశా ! నీచంబని సంకోచింపవలదు. సత్యప్రతిష్ఠకై యొనర్చిన నీచకార్యంబులును సగౌరవంబులే యగు.

హరి—హా ! జీవితేశ్వరీ ! హా ! సుగుణసుమవల్లీ ! కఠిన కర్ముండవగు నే నెంతకుఁ జాలను ? హృదయమా ! నేటితో నభిమానము వదలివేయుము. దేవీ ! చంద్రమతీ !

గీ. హృదయమున సెగ్గుసిగ్గులు ♦ వదలివేసి
దాసిగా నిన్ను నమ్ముకోఁ ♦ దలచినాఁడ
వాడవాడల నిన్ గొను ♦ వారి నూర
వెదకికొనఁ బోవుదము ముందు ♦ లతాంగి !

చంద్ర—(నడచుచు) ఓ దేవా ! కాశీ విశ్వనాథా ! నన్నుఁ గొనువారిఁ ద్వరలో నగపఱచి మమ్ము విశ్వామిత్ర ఋణబాధావిముక్తులను జేయుము తండ్రీ !

నక్ష—హరిశ్చంద్రా ! ఇదియే అంగడివీధి. ఇక్కడ ఒక్క కేక వేయుము.

హరి—దేవీ ! నే నిప్పు డేమని ఘోషింపవలయును ?

చంద్ర—క్రయధనమ్ము నమ్ముకొనువా రెట్లో యట్లే.

హరి—ఓహో ! పౌరులారా ! (కొంచె మూరకుండి) అయ్యో ! యెంత నైచ్యమునకు బాల్పడుచుంటి ?

నక్ష—హరిశ్చంద్రా ! ధనమిచ్చి కొనఁదగినవా రందఱక్కడ నేయున్నారు ? ఇఁక నీయాగడములు చాలించి యందఱు వినున ట్లెలుంగెత్తి కేక వేయుము.

హరి—అయ్యో ! నే నన్నింటికిఁ దెగించియే యున్నాను.

ద్విపద : అనురాగము - కీరవాణి - ఆదితాళము.

అవధారుఁడయ్య యో ♦ యగ్రజులార !
సవనదీక్షితులార ! ♦ క్షత్రియులార !
ద్రవిణేశు మించు న ♦ త్తమ వైశ్యులార !
ప్రవిమల గుణగణ్యు ♦ పాదజులార !

కడ లాక్రమించి యొ ♦ క్కట భూమి నేలి
నడినున్న యా హరి ♦ శ్చంద్రుండ నగుట
ప్రణుత కౌశిక ఋణ ♦ గ్రస్తుండ నగుట
గుణములదొంతి క ♦ ల్కుల మేలుబంతి
పున్నెపింతుల యీలు ♦ పున కోజబంతి
యన్నుల తలకట్టు ♦ లందు సేమంతి
యగు నాదు నిల్లాలి ! ♦ హా ! దయమాలి
తెగ నమ్ముకొందు నీ ♦ ధిని దాసిగాను
చేరి రొక్కంబిచ్చి ♦ చెల్వను గొనుడి
వారణాసీ పౌరవరులార ! మీరు,

మఱియు నో భాగ్యవంతులారా !

సీ. జవదాటి యెఱుంగ దీ ♦ యువతీలలామంబు
పతిమాట రతనాల ♦ పైడిమూట
అడుగు దప్పి యెఱుంగ ♦ దత్తమామలయాజ్ఞ
కసమానభక్తి ♦ వ్యానురక్తి
అణుమాత్రమైన బొం ♦ కనుమాట యెఱుంగ దీ
కలుషవిహీన న ♦ వ్వులకునైన
కోపం బెఱుంగదీ ♦ గుణవితాన నితాంత
యొరులెంత తను దూఱు ♦ చున్నసుంత
ఈలతాంగి సమస్త భూ ♦ పాలమకుట
భవ్యమణికాంత శబలిత ♦ పాదుఁడైన
సార్వభౌముని శ్రీహరి ♦ శ్చంద్రుభార్య
దాసిగా నిపుడ్ గొనరయ్య ♦ ధన్యులార !

[పిమ్మటఁ గౌశికునితోఁ గాలకౌశికుఁడు ప్రవేశించుచున్నాఁడు]

ఓరీ ! శిష్యా ! యెక్కడరా దాసిసల విక్రయించునది ?

హరి—బ్రాహ్మణోత్తమా ! ఇక్కడనే, మందభాగ్యుఁడనైన నేనే దాసిసల విక్రయించుచున్నాఁడ.

కాల—అట్లయిన నీ వెవ్వఁడవు ? ముందుఁ జెప్పుము ?

హరి—నే నెవ్వండనైన మీకేమి ?

కాల—ఏమోయీ, పేరు చెప్పుటకే సందేహించుచున్నావు. ఈకాంతను నీ వెక్కడనో యెత్తుకొనివచ్చిన ట్లున్నావే ? ఆఁ! నీవే దొంగతనము చేసినను సాగి వచ్చుటకు నీ కాశికాపురమంత యరాజకముగ నున్నదనుకొంటివేమి ? బ్రోయు వానికి రామచిలుకలాగున నీకీకాంత యెక్కడ చిక్కినది ? ఘాలాతుక నంత వాఁడవైన నాకంటం బడి తప్పించుకొనిపోవుట కల్ల. (శిష్యునితో) ఓరీ! కేశవా! నీవు పోయి మనయూరి తలారి పెద్దయగు రామసింగును బిలిచికొని రమ్ము. ఈ ద్రిమ్ముచ్చును బట్టి యొప్పగింతము.

హరి—అయ్యా! విప్రోత్తమా!

గీ. ధరణిలో దొంగతనములో ♦ దొరతనములో
భాగ్యవంతుని కేదైన ♦ బాధలేదు
పెన్నిధి యదృష్టమున నిటు ♦ పేదవాని
కబ్బినను దొంగసొమ్మంట ♦ కబ్బురంబె!

కాల—ఏమీ! నీ యదృష్టమునకుఁ దోడు నీ కీకాంత యెక్కడో లభించినదా ?

హరి—అదృష్టముచేత లభించినది. నేను హరిశ్చంద్రుఁడను. ఈయమ నాభార్య చంద్రమతి.

కాల—ఏలాగూ ? విశ్వామిత్రున కప్పుపడితినని యఱచినది నీవేనా ? అలాగైనఁ దపోధనుఁడైన యమ్మునికి నీవెట్లు ఋణపడితివి ?

హరి—నా రాజ్యసర్వస్వ మాతనికి ధారవోయునప్పుడు మున్నాతనికి యజ్ఞార్థమై యిచ్చెదనన్న ధనము ముందుగా నిరూపింపకపోవుటవలన.

కాల—పత్రము వ్రాసి పుచ్చుకొనిన గాని యప్పు కాదుగదా! సాక్షు లెవరైన నున్నారా ?

హరి—సత్యశీల మే పత్రము. మాయుభయుల చిత్తములే సాక్ష్యములు.

కాల—ఓయీ యమాయకుఁడా! ప్రాణములేని యీపత్రమునకును సాక్ష్యమునకును భయంపడి నిక్షేపమువంటి యిల్లాలి నమ్ముకొనుచున్నావా ? (ఆలోచించి) ఉండుండుము. నాకిప్పుడు మంచియుపాయము తోఁచినది. నన్నా విశ్వామిత్రు నొద్దకుఁ దీసికొనిపోయి యీధనము నీ కీయవలసినది కాదని పోరాడుము. నీపక్షమున నేను న్యాయవాదిత్వము గైకొని రాయి గుద్దుచు వాదింపగలను. ఓహో! ఒకరికిఁ బదుగురు సాక్షు లుంచిన పత్రముల నెగవేయుటలోను, ద్రోవఁ బోవువారిపై లేనియప్పుల గట్టి ధనము గణించుటలోను నన్ను మించినవాఁడు మఱొక్కండు నీకు దొరకఁడు. పద. నేను నీకు సహాయుఁడనై యుండ విశ్వామిత్రుఁడును గిశ్వామిత్రుఁడును ని న్నేమి చేయఁగలఁడో చూతము.

నక్ష—హరిశ్చంద్రా! నీకిప్పుడు సహాయసంపత్తి గూడ లభించినది! ఇఁక రమ్ము.

హరి—అయ్యలారా! మీరిరువురును మహాబ్రాహ్మణులు కాని యూరకుండుఁడు. నాకెవ్వరి సహాయమక్కఱలేదు. నాసత్యమే నన్ను రక్షింపవలయును గాని,

మ. ఇటులెంతైన ధనంబు వచ్చినను రా ♦ నీ గాధిజాటున్నాతి నా
కెటుకష్టంబులఁ దెచ్చెనేనియును దే ♦ నీ, దివ్యభోగంబు లె
న్నిఁటి నాకాజడదారి యిచ్చినను నీ ♦ నీ, సత్యముం దప్ప నే
నిటుసూర్యుండటులెటోఁచెనేనియు వినుం♦డీ మీరుముమ్మాటికిన్.

కాల—ఓహో! నీవెంత సత్యవంతుఁడవైనను ధనముపట్ల కొంచెము సడలు విడువవచ్చును. అందులకే "సర్వేజనాః కాంచనమాశ్రయంతి" యని పెద్దలు చెప్పుచున్నారు. నాయీశాస్త్రప్రమాణ మంగీకరించి కౌశికునొద్దకు నడువుఁడు. చూడుము.

క. ఆలాగునఁ గౌశికుఁడే
పాలయ్యె ధనాశ కింక ♦ వల దుడుగుము నీ
కేలా! యీవేదాంతము?
పాలొల్లని పిల్లి గలదె ♦ పరికింపంగన్?

హరి—అయ్యా! ఏల మీకిన్ని మాటలు?

కాల—సరియే, నీకు బాగుబడు యోగము లేదు. తియ్యని చెఱకుపానకము నోటఁ బోయుచుండ విసమని గ్రక్కువాని కెవ్వరేమి చెప్పగలరు? నీ యిష్టము. నీభార్య నెంత కమ్మెదవు?

హరి—నక్షత్రకా! చెప్పుము.

నక్ష—ఓ కాలకౌశికుఁడా! వినుము.

క. దంతావళము పయిన్ బల
వంతుం డొక్కండు నిలిచి ♦ పైకిన్ రతనం
బెంతటి దవ్వుగ రువ్వునొ
యంతటి యర్థంబు నిచ్చి ♦ యతివం గొనుమీ.

కాల—ఓహో కేశవుఁడా! ఇదేమి చవుకబేరము గాదురా?

నక్ష—మఱి పంచాంగము కట్టకే వచ్చునేమి?

కాల—ఏమిరా చెడుగా! మాయాయవారపు జోలె చూచి నన్ను ధనహీనునిగా గణించినట్లున్నావు కాని. దీని మాయింటికిఁ బంపివేయుము. ధన మిచ్చివేయుదును. హరిశ్చంద్రా! సరియే కదా?

హరి—అయ్యో! అట్లే.

కాల—దాసీ! ఇఁక బద. కుత్తా! నడువుము. (బెత్తమున నదలించును)

చంద్ర—అయ్యో! వచ్చుచున్నాను. (పతి పాదములపైఁ బడును)

కౌశ—దాసీ! నడువవేమి ?

చంద్ర—హా! మందభాగ్యనైన నేను నేఁటితో మీదృష్టినుండి సయితముఁ దొలఁగింపబడి పరాధీననైపోతినే! ప్రాణపతీ! హరిశ్చంద్రా! నాకింకదిక్కెవ్వరు?

చ. పదపదయంచు బెత్తమున ♦ బ్రాహ్మణుఁ డిట్లదలించు చుండినన్
బద మటు సాగకున్నది భ ♦ వత్పద సారసభక్తియందు నె
మ్మది వశమాట, చంద్రకర ♦ మర్దన మించుచునుండినన్ బదిం
బదిగ మరందలోలయయి ♦ పద్మము, బాయని భృంగికైవడిన్.

అకటకటా! ఇంక మిమ్ముఁ జూచు నవకాశము నాకు లేదు. నా యజమానుఁ డింకను దొందరపడుచున్నాఁడు. ఈస్వల్పకాలములోనే శుభదాయకంబగు మీమూర్తి గనులారఁ గాంచిపోయెదను. ప్రాణపతీ!

సీ. కదలవే యని విప్రుఁ ♦ డదలించుటకు మున్ను
గనులార మీమోముఁ ♦ గాననిండు
పదవేమి యని వటుం ♦ డదలించుటకు మున్నె
మీనోటి నుడితేనె ♦ లాననిండు
నడువవేమని విప్రుఁ ♦ డడలువెట్టక మున్నె
పాదము మీకన్నీరుఁ ♦ దుడువనిండు
సాగవేమని వటు ♦ ల్లాగవచ్చుటకు ము
న్నింపుగా మిముఁ గౌఁగి ♦ లింపనిండు
పరమకరుణాసనాథ! మ ♦ త్ప్రాణనాథ!
కాలగతి మీకు దూరస్థు ♦ రాల నగుచు
వెడలు కన్నీఁటఁ బాదము ♦ ల్గడిగి మీకుఁ
బ్రణతు లిడుచున్నదాన స ♦ ద్గుణనిధాన!

హరి—(నిర్వేదముతో) ఛీ! ఛీ! హరిశ్చంద్రా! నీవు నిక్కముగా జన్మింపవలసినవాఁడవుగదా!

గీ. గళమునం దాల్పవలసిన ♦ యలరుదండ
పాదమర్దన కొప్పించు ♦ భంగిగాఁగ

అఖిల సామ్రాజ్యభోగంబు ♦ లందఁదగిన
పట్టపుందేవి నమ్మితే ♦ బానిసగను.

చంద్ర—హృదయేశ్వరా ! నాకై మీరంతగా దుఃఖింపవలదు. విధివిధాన మెవ్వరు తప్పింతురు ? దుఃఖ మడంచుకొని యీ కాలకౌశికుని సేవావృత్తికి నన్నిఁక సమ్మతించి పంపివేయుఁడు.

హరి—దేవీ ! ఇప్పు డనుమతించుటేమి ? ఆగర్భశ్రీమంతురాలవైన నిన్నుఁ బరున కెప్పుడు విక్రయించితినో యప్పుడే నాయనుమతు లన్నియుఁ దీఱినవి కాని

మ. కనుసన్నన్ బనికత్తెలెల్ల నిలువం ♦ గన్ గొల్వ రాణించు జీ
వనమే కాని యెఱుంగ వెప్డుఁ బరసే ♦ వాకృత్య మాజన్మమున్
వనితా ! నేటికి నీకు నావలనఁ బ్రాప్తం ♦ బయ్యె నెట్లోపెదో ?
ఘనదుర్దాంతదురంత దుస్సహామహో ♦ గ్రక్రూర దాస్యంబునన్.

మానవతీ ! రాణివాసంపు భోగభాగ్యంబులకుఁ జెడి నూతనముగా దాసికావృత్తి నవలంబింపఁ బోవుచున్న నీకుఁ గొంత చెప్పుచున్నాను. సావధానముగా నాకర్ణింపుము.

మ. తలిదండ్రుల్ మఱి వేఱ లేరిఁక సతీ ! ♦ తద్దంపతుల్ గాక నీ
కిల, నీ వేమఱుపాటు నెందదు సుమీ ♦ యీ విప్రసేవాకృతిన్
దొలి నీవొందిన భోగభాగ్యములయం ♦ దున్ జిత్తమున్ నిల్పకే
తలలో నాలుకగా మెలంగుము నెలం ♦ తా పిన్నలన్ బెద్దలన్.

మఱియు నో సాధ్వీమణీ ! నీ స్వామికడనే బానిసీఁడుగ నుండవలసినవాఁడు గానఁ గుఱ్ఱవాని లోహితాస్యు నెట్లు గాపాడుకొందువో ? మనకు నేఁటితో దురంతమైన వియోగంబు సంభవించినదికదా ! (లోహితాస్యునితో) నాయనా ! లోహితాస్యా ! నీవు గూడ నీతల్లి ననుసరించి యుండవలసినవాఁడవే కాన నా వెంట రాకుము.

లోహి—నాన్నగారూ ! మీ రెందు కేడ్చుచున్నారు ? మీ రిప్పు డెక్కడకుఁ బోయెదరు ?

హరి—నాయనా ! నే నెక్కడ బానిసీఁడుగా నుండవలెనో యక్కడికే.

దీనవృత్తము : హిందూస్థానీ - భైరవి - ఆదితాళము.

లోహి—జనకా ! యిపు డెచ్చటి కేగకుమా
నను నీ వెనువెంటను గొనిపొమ్మా
జననిన్ నను నిచ్చట బ్రాహ్మణుఁడే
కొనిపోయిన మాకు సుఖం బగునే ?

హరి—తండ్రీ! (మొత్తుకొని) నీకు రావలసిన కష్టములా యివి ?

మ. కొడుకా! కష్టము లెన్ని వచ్చినను నీ ♦ కు న్నాకు నాకీడులం
దెడఁబాటు ల్ఘటియింపకుండు టొక మే ♦ లే యంచు నే సంతసం
బడితింగాని యెఱుంగ నిన్నుఁ దెగన ♦ మ్మువజూపి హా లోహితా!
కడ కీనాఁటికి గాలసర్పమునకుం ♦ గైకోలుఁ గావించుటన్.

హా! తండ్రీ! నీ కమంగళము ప్రతిహత మగుగాక!

(మరల) కడ కీనాఁటికిఁ గాలకౌశికునకుం ♦ గైకోలుఁ గావించుటన్.

దేవీ! నేనెంత దారుణమైన వాక్యమును బల్కితిని.

చంద్ర—నాథా! మనకు దుఃఖము శాంతించునుగాక!

గీ. కాలవశమున గల్గిన ♦ కష్టచయము
లెల్ల వెంటనె నిలుచునే ♦ యొకరీతి
మిహిరమండలమును గప్పు ♦ మేఘపటలి
తూలిపోకుండునే యెల్ల ♦ కాలమటులె ?

అట్లే యచిరకాలమునకు మరల శుభములు వచ్చి పునస్సమాగమసౌఖ్యము లభింపకపోదు.

హరి—దేవీ! భవితవ్యమును నెవ్వ రెఱుంగుదురు ? చూడు.

మ. కలికీ ఱెక్కలురానిపిల్లలను సా ♦ కన్ గూటిలోనుండి మేఁ
తలకై పోతొతక చెంతఁ బెంటియొక చెం ♦ తన్ బాఱ నీలోనఁబి
ల్లలఁ బామే గ్రసియించునో వలలపా ♦ లన్ జిక్కునో పుల్గు, లీ
యిలపైఁ బ్రాణులకున్ వియోగమగుచో ♦ నెవ్వారి కెవ్వారలో.

కౌశ—ఏమయ్యా! శుభమస్తు అని మా గురువుగారు దాసిని గొనుక్కొనుటేమి ? మీరిట్లశుభముగా నేడ్చుటేమి ? పద పద. (అదలించును)

లోహి—(కోపములోఁ గౌశికునిఁ జూచి)

స్రగ్విణీవృత్తము : బేహాగ్ - ఆదితాళము.

పర! మాయమ్మ ని ♦ ట్లీడ్వ నీకేమిరా
క్రూర! నిన్నిప్పుడే ♦ గ్రుద్దెదన్ జూడరా
దూరమందుండి మా ♦ తోడ మాట్లాడరా
శూరునిన్ లోహితున్ ♦ జూచి నోర్మూయరా.

కేశ—ఓరీ! చెడుగా, దాసీపుత్రా! కూటికి లేకపోయినను నీకెంత రాజస మున్న దిరా? (పడద్రోయును)

లోహి—(కన్నీరు గార్చుచుఁ దండ్రివంకఁ జూచును).

హరి—(దుఃఖముతోఁ గుమారు నెత్తుకొని) తండ్రీ! నీకెంత దురవస్థ వచ్చెనురా?

మ. కనుదోయిన్ జడిబాష్పముల్దొరఁగ నా ♦ కై యేల వీక్షించెదో
తనయా! నేను మహాకిరాతుఁడ సమ ♦ స్త ద్వీప భూమండలీ
జననాథావళికి సార్వభౌముఁడవుగాఁ ♦ జా ల్చిన్న నీదాస్యపుం
బనికై యమ్మిన నాకు నెచ్చటి దయా ♦ ప్రారంభవిస్రంభముల్.

కాల—ఓహో! యేమోయీ! నీకొడు కిట్లనుచున్నాఁడే; ఇఁక మాయి ల్లల్లకల్లోలము చేయును నా యేమి?

హరి—అయ్యా! ఇది కేవలబాల్యచాపల్యము. కాని నా మనవి యొక్క టాలింపవలయు.

కాల—అది యేమి?

హరి—గీ. మీరు బిడ్డల గని పెంచు ♦ వారె యైన
కడుపుకక్కఱితిని నింతఁ ♦ గా వచింతుఁ
బ్రేమ నీబిడ్డలం దొక ♦ బిడ్డగాఁగ
నరసి కొనుమయ్య వీనిఁ ♦ గృపాంబురాశి!

(లోహితు నొప్పగించును)

కాల—సరి. నీయప్పగింత లన్నియు నైనవా? ఇంక మా దాసినిఁ బంపివేయుము. మాకు జాగగుచున్నది.

చంద్ర—(దుఃఖముతో) సరసాంకవృత్తములు – ఫీలురాగము.
సెలవిచ్చి నన్పనుపుడీ క్షితిపాలచంద్రా!
వలవంత జెందకిఁక పావన సత్యసాంద్రా!

హరి— కలకాల మీఁగతిని దుఃఖముతో సుశీలా!
తల పెట్టు టూఁటడిలు నింతట ముద్దరాల!

చంద్ర—ఇఁక జాగుచేయఁదగ దో నృపసార్వభౌమా!
సకలం బెఱింగి యింటు లెన్నియొ పుణ్యధామా!

హరి— అకలంకశీల! నిను ని ట్లలయించినాడన్
మొక మెత్తి యెట్లు మననోపుదు సిగ్గుతోడన్.

కాల—ఓహో ! మీరేడ్పుతో మా పను లన్నియుఁ జెడుచున్నవి. దాసీ, కదల
వేమి ? మూటలెత్తుకొని రమ్ము.

చంద్ర—(లోహితాస్యునితోఁ దిరిగి తిరిగి పతిం జూచుచుఁ బోవుచున్నది.)

కాల—నక్షత్రకా ! ధనమిచ్చెద రమ్ము.

హరి—హా ! హా ! నాపుణ్యలక్ష్మి దాఁటిపోయినది.

నక్ష—హరిశ్చంద్రా ! నీవు విశ్వేశ్వరదేవాలయమునొద్ద నుండుము. నేను ధనమంది
కొనివత్తును. (కాలకాశికునితో నిష్క్రమించును)

[పిమ్మట యవనిక నెత్తగాఁ గాలకంటకి గృహద్వారముకడఁ బ్రవేశించును]

కాలకం—ఓరీ, యెవడురా ? కేశవా ! జనార్దనా ! అంగడికిఁ బోయిన మా
యాయన యింకను రాలేదుగా ? కానీ.

[కాలకాశికుఁడు, కేశవుఁడు, చంద్రమతి, లోహితాస్యుఁడును
ప్రవేశించుచున్నారు]

కాలకా—ఓరీ, కేశవా ! అదిగో అఱచుచున్నదిరో.

కేశ—అయ్యా ! ఈనాఁడు మీగ్రహచార మంతగా బాగున్నట్లు తోఁచదు.

కాశి—ఏమోరా నాయనా ! నీవుమాత్రము మాముండతో నామీఁదఁ గొండెములు
చెప్పకేమి ? (ఇల్లు చేరుదురు)

కాలకం—వచ్చుచున్నావు ? రా, రా, (సమీపించును)

చంద్ర—అకటకటా ! ఏమీ ధూర్తయైన యీ విప్రాంగన వర్తనము ! ఈబిడయే
నాయజమానురాలు కాఁబోలు !

కాలకం—దుర్మార్గుఁడా ! నీవిల్లు వదలి యెంతసేపైనది ? నీకొఱకై ప్రొయార్చు
కొని నేను కనిపెట్టుకొని యుండవలసినదా ? ఈమధ్య నీకుఁ బొత్తుగాఁ
బ్రాయశ్చిత్తకర్మలు లేకుండ నున్నవి. నేఁడు నీకు మూఁడినది కానీ చెప్పు.

కీర్తన : ఫరజు - త్రిశ్రగతి.

ఇంత ప్రొద్దెక్కినదాక నీవెక్కడ నుంటివి యింటికి రాక ॥ఇం॥

కాలకౌ-యాయవార మెత్తినాఁడ సంతపోయి శవాలను మోసివచ్చి
నాఁడ ॥యా॥

కాలకం- తెచ్చిన డబ్బేదో తెమ్ము నీముచ్చుపోకిళ్లను మెచ్చ రారమ్ము

కాలకౌ-మూడేమాడలఁ దెచ్చినాడనీతోడునాకింకనుదొరకలేదే వాడ

కాలకం-అట్లైన నే నూరుకోను నీపొట్ట బ్రద్దలుచేసి నెట్టివేయకపోను
(కొట్టుచున్నది)

కాలకౌ-అబ్బబ్బ నే నోర్వలేను యీ డబ్బునకు రేప యిబ్బడిచ్చెనే

కాలకం—నీవింక జాగరూకతతో మెలంగకున్న నీగతి యింతియే.
కేశ—అమ్మా! కాలకంటకీ! నేఁ డప్పుడే వదలిపెట్టినావే? ఇక్కడ చూడు.
(చంద్రమతి లోహితాస్యుని జూపించును)
కాలకా—ఓరీ! కేశవా! నీపుణ్యము. నీవూరుకోరా! (గడ్డముపట్టి బతిమాలును)
కాలకం—ఇఁక నే నూరుకోను. ఈ నిర్భాగ్యురా లెవరు? చెప్పు. (కొట్టును)
కాలకా—గట్టిగా చేతులు పట్టుకొనుచు నీకడుపుడక, యింక చంపకే.
కాలకం—ఓరీ! నీచేతులు కాలిపోను! నీశక్తి మండిపోను! ముసలితనము వచ్చి
నను నీకెంత మద మున్నదిరా! ఓ యెవరయ్యా! నన్ను నామగఁడు చంపు
చున్నాఁడు రండయ్యా! (కేకలు వేయుచున్నది)
కాలకా—(నోరుమూయుచు) ఓసీ నీపుణ్యము, అఱచకే. సుకుమారివి, నీవింటిలోఁ
బనిచేసికోలేవని దాసినిఁ దెచ్చినాఁడను.
కాలకం—ఆమాట మొదటనే యేడవరాదా?
చంద్ర—అమ్మా! కాలకంటకీ! ఇది యేమన్యాయమమ్మా!

క. పతిఁ గడవ సతికి ♦ లేదొక
గతి యాతం డెంత మనకుఁ ♦ గైవసమైనన్
మితి గలదు ♦ చనవునకు నీ
గతి బ్రతికూలతకుఁ బాలు ♦ గాఁదగునమ్మా!

శా. ప్రత్యూషంబున లేచి నాథుని పదా ♦ బ్జాతంబులన్ వ్రాలుటో
ప్రత్యుద్దేశ్య మెఱిఁగి భోనముల సం ♦ పాదించుటో, రాకకున్
ప్రత్యుత్థాన మొనర్చి మెచ్చదగు సే ♦ వల్ సేయుటో, కాకిటున్
ప్రత్యాఖ్యాన మొనర్తుగమ్మ సతమున్ ♦ బత్యాజ్ఞకున్ గేహినుల్?

మఱియు

మ. పడతీ! నేనొకపాటిగాను వచియిం ♦ పన్ నీవిభుం డెంత నీ
యెడఁ బ్రేమం బాఁటడయేని బత్తిమిగులన్ ♦ హత్తించి బంగారమే
మొడ లెల్లన్ దిగవేయునట్లుగను నీ ♦ వోరంత ప్రొద్దెల్ల మే
లడపాఱ్ఱానుము, కాళులొత్తు మాటుగా ♦ దాసీవరుల్ వీచుమా,

కాలకం—ఓహో! నీవెవ్వతెవే? నాకుఁ జక్కట్లు దిద్దుటకేనా నామగడు నిన్ను
దీసికొని వచ్చినది? ఓహో! దాసివై వచ్చి దొరసానివైతివి? నీకుఁ దెలిసిన
మగనాలి వర్తనాటు మాకుఁ దెలియదేమి? కూఁటికి వచ్చినదానవు చచ్చి

నట్లు పడియుండక శ్రీరంగనీతులు చెప్పుచు నాగోటలోఁ బడియున్న నా మగని బుద్ధి చెడగొట్టుచున్నావుగా.

కాలక.—చంద్రమతీ! నీ వెప్పుడు మాయాబిడతో నిట్లు మాట్లాడఁగూడదు. (రహస్యముగా) దీని నోటికి నూరి కరణాలు కొంపులుఁ గూడ వెఱచుచుండును.

చంద్ర—అయ్యా! నే నూఱకున్నాను.

కాలక—ఓసీ! యింటిదానా! నీతో నింతనిర్భయముగా మాటాడిన యీదాసికిఁ దగిన పనులు నియమించి నీకసి దీర్చుకొమ్ము.

కాలకం—అట్లయిన పద. నీపని చెప్పెద. (అందఱు నిష్క్రమింతురు)

[పిమ్మట నక్షత్రకద్వితీయుఁడై హరిశ్చంద్రుఁడు ప్రవేశించుచున్నాఁడు]

హరి—నక్షత్రేశ్వరా! నన్నింత యన్యాయము చేసెదవా?

నక్ష—అడవులలో నన్నిన్నాళ్ళన్నమునకును నీళ్ళకును మొగము వాచునట్లు చేయుట నీది యన్యాయము కాదుగాని న్యాయముగా నాకు రావలసిన బత్తెము నేను తీసికొనుట యన్యాయ మయ్యె నేమి యెట్లు?

ఉ. బత్తెము లేక త్రోవల వి♦పత్తుల కోర్చుచుఁ దిండికేనియున్
బొత్తుగ వాచిపోయి గృహ♦మున్ విడి నీవెనువెంట రాను నీ
తొత్తునె? యింతకంటెను గ♦తుల్మరి మాకిక లేవె! యేరికేన్
మెత్తనివానిఁ జూచునెడ♦ నిక్కిలి మొత్తఁగ జిత్తమౌఁ గదా!

హరి—నక్షత్రకా! మీ గురువుగారి పనిమీద నీవు నావెంట వచ్చితివి కాని నా కొఱకై వచ్చితివా? నావలన బత్తెమే నీవు తీసికొనిన నీవు నీగురునకు జేసిన యుపకార మేమున్నది?

నక్ష—ఓయి దుర్మార్గుఁడా! ఏమన్నావు? నేను నాగురువునకుఁ జేసిన యుపకార మేమనియా?

ఉ. ఆస దొఱంగి ప్రాణముల♦కైనఁ దెగించుచు నిట్టి బత్తెపుం
గాసుల నాసచే దరువ♦ కానిగ నీపయి ఘోరకాననా
వాస మొనర్ప నొప్పుకొని♦ వచ్చుటె నాయుపకార మాతపో
భ్యాసికి; నావలెన్ వటుఁడె♦ వం డిటు నెత్తురుకూటికొప్పెడిన్.

ఇప్పుడు నా గురుభక్తిని గూడ నధిక్షేపించుచున్నావుగా? నీ వేమైన ననుము. నీభార్య నమ్మగా వచ్చిన యీధనము బత్తెముక్రింద జెల్లవలసినదే కాని నీక మాగురువుగారి ఋణమిప్పుడే యిచ్చివేయుము.

హరి—వటూత్తమా! నే నిప్పు డింత ధనమెక్కడనుండి దెత్తునయ్యా!

గీ. విమలశీలను నిల్లాలి ♦ విక్రయించి
చేర్చినధనంబు నీచేతఁ ♦ జిక్కెనుగద ?
అవని స్వశరీరమాత్రవై ♦ జవుఁడ నగుచు
బ్రతికుచున్నట్టి నేనెట్లు ♦ బత్తెమిత్తు ?

నక్ష—నీవిట్టి నిర్భాగ్యుఁడ వనియే నేను దీప ముండగనే చక్కబెట్టుకొన్నాఁడ.
ఓ హరిశ్చంద్రా ! ఇటు వినుము.

గీ. నాకు రానున్న బత్తెంపు ♦ రూక లెటులో
స్వీకరించితి నే నిల్లు ♦ జేరవచ్చు
ముని ఋణమునకు మీరు మీ ♦ రును బెనంగి
తుదకు నేగంగలోనైన ♦ దుముకఁ బొండు.

(పోవుచున్నాఁడు)

హరి—(చేయి పట్టుకొని) నక్షత్రకా ! నీ కిది బొత్తుగాఁ దగనిపని.
నక్ష—ఏమోయి చేయి పట్టుకొనుచున్నావు ? నన్ను గొట్టుదువా యేమి ?
హరి—అయ్యా ! నేనంత సాహసిని గాను.
నక్ష—కానున్న నాచేయి విడువుము.
హరి—విడిచితిని ! ఇఁక నాసొమ్ము మీగురువున కిచ్చివేయుము.
నక్ష—హరిశ్చంద్రా ! నేనిన్ని మాటలవాఁడను కాను.

క. అడియూస విడువుమిఁక నా
యొడలన్ జీవంబులున్న ♦ నొడమిన్ విడువన్
జెడనెంచితేని నిను నా
మెడ నీయడదమునఁ గోయు ♦ మీ, రో గొనుమీ.

హరి—నక్షత్రకా ! ఇంతకన్న నేఁ జెడునదేమున్నది ? నన్నుఁ గూడ నమ్ముకొని
మీగురుఋణంబు రాఁబట్టుకొనుము!
నక్ష—ని న్నెవ రిచ్చుటఁ గొందురు ?
హరి—ఎవ్వరుఁ గొనకున్నఁ గడకుఁ గడజాతివానికైన నమ్మివేయుము
నక్ష—సరి, నిన్ను, గాదననేల ? (నడచుచు)

ద్విపద : రాగము - కీరవాణి - ఆదితాళము.

అవధారుఁడయ్య యో ♦ యగ్రజులార !
సవనదీక్షితులార ! ♦ క్షత్రియులార !

ద్రవిణేశు మించు న ♦ త్తమ వైశ్యులార !
ప్రవిమల గుణగణ్య ♦ పాదజులార !
కడ లాక్రమించి యీ ♦ క్కట భూమి నేలి
నడినున్న యాహరి ♦ శ్చంద్రుండు నేడు
బానిసీడుగ నమ్మఁ ♦ బడుచున్నవాఁడు
మానసీయుండు సత్య ♦ మార్గధీరుండు
కోరిన ధనమిచ్చి కొనఁ ♦ దగుసుండి,
వారణాసీ పౌరవరు ♦ లార ! రండి.

(ఆకసమువంకఁ జూచి) ఏమీ ! ఇతఁ డెట్టివాఁ డనుచున్నారా ?

సీ. తన మహీరాజ్య నుం ♦ తయు గాధిసూతికిన్
దానమిచ్చిన యట్టి ♦ ధర్మరాజు
నిజయశశ్చంద్రికల్ ♦ నిఖిల దిక్కులయందుఁ
బాఁజల్లిన యట్టి ♦ సారగుణుండు
ముల్లోకములను స ♦ మ్మోదింప భేతాళు
మద మడంచిన విక్ర ♦ మస్థిరుండు
అణుమాత్రమైన బొం ♦ కను మాట యెఱుఁగని
యసమాన నిత్యస ♦ త్యవ్రతుండు
ఏడు దీవుల నవలీల ♦ నేలినట్టి
సాంద్రకీర్తి హరిశ్చంద్ర ♦ చక్రవర్తి
బానిసీఁడుగ నమ్మంగఁ ♦ బడెడు కొనుఁడు
పౌరులార ! మహాధనో ♦ దారులార !

హరిశ్చంద్రా ! ఎవరు కొనకున్నారు ? ఇంకెంతని యఱచెదను ? వీఁ డెవఁడో కడజాతివానివలె నున్నాఁడు. ఇటె వచ్చుచున్నాఁడు. ఉండుము.

[పిమ్మట వీరబాహు ప్రవేశించుచున్నాఁడు]

గేయము

తొలఁగిపోనిండయ్యా ! దొరలు పెద్దింటోణ్ణి
తెలచి చెప్పకుంటే పలువ పొమ్మంటారు ॥తొ॥
పఖులు మీకుక్కల కట్టివేస్కొండయ్యా ॥తొ॥

గబగబ పొ వంచు కఱవ వత్తుండయ్యో
వాద నంటారు మా దోచ మంటారు నే
కాచంత కల్లేసి కాటికి పోతుంద ॥తొ॥

నక్ష—హరిశ్చంద్రా ! ఇంక నిన్నెవరు కొందురు ?
వీర—దొరా ! బానిసోణ్ణి అమ్ముతుండావా ? నేగొంటానండి. ధర సెప్పండి.
నక్ష—చెప్పెదనుగాని నీవు దూరముగా నుండి మాటాడుము. నేనిప్పుడు స్నానము చేయలేను.
వీర—దూరంగానే వుండానుండి, సెప్పండి.
హరి—నక్షత్రకా ! నన్నీ కడజాతివానికే యమ్మెదవా ?
వీర—కడజాతి యేముంది. పెద్దింటోణ్ణి.
నక్ష—హరిశ్చంద్రా ! ఎవ్వరు గొనకున్న నన్నేమిచేయమందువు ? మొత్తమువీద నీవు నాకిచ్చు బత్తెమునకు దండుగ లేకుండ నావలనఁ బని పుచ్చుకొను చున్నావు. అఱచి యఱచి గొంతు పగిలిపోవుచున్నది. తిరిగి తిరిగి కాళ్ళు పడిపోవుచున్నవి.
హరి—అయ్యా ! వీనికే విక్రయింపుఁడు. నే నన్నిటికి సిద్ధుఁడనై యున్నాను.
నక్ష—ఓరీ ! వీరబాహూ ! నీకీతఁడు కావలయునన్న—

క. దంతానళముపయిన్ బల
వంతు డొక్కండు నిలిచి ♦ పైకిన్ రతనం
బెంతటి దవ్వగ రువ్వునొ
యంతటి యర్థం బొసంగు ♦ మా కొనిపొమ్మా.

వీర—వీరబ్బో ! సాలదాకుండదే !
నక్ష—ఇఁక నేమనుకున్నావు ? వీరబాహూ ! నీచేతగాదు పోరా.
వీర—అయ్యోరూ ! యిట్లుండానని నూత్తుండావు కామాసు ! దబ్బిత్తా రా. రావయ్యా అరిచ్చంద్రుఁడా.
నక్ష—హరిశ్చంద్రా ! ఇఁక బొమ్ము. నీఋణము తీఱినది.
హరి—నక్షత్రేశ్వరా ! నేనిఁక సెలవు పుచ్చుకొనియెద. ఎక్కడనో నిశ్చింతతోఁ దపం బాచరించుకొను నీవు గూడ నామూలమున ఘోరారణ్యములఁ బడరాని పాట్లు పడితివి. నన్ను క్షమింపుఁడు. వటూత్తమా ! నమస్కారము.
నక్ష—(స్వగతము) అయ్యో ! నేనిప్పు డేమని యీధర్మమూర్తికిఁ బ్రత్యుత్తరమిచ్చెదను ? ఇట్టి పరమశాంతుని సత్యవంతుని నేనెంత చేసితిని ! (ప్రకాశముగా) హరిశ్చంద్రా ! నేనే నీ కన్నివిధములఁ గష్టములఁ దెచ్చిపెట్టిన దుష్టుఁడను. నేను నిన్నడుగుకొనవలసిన క్షమాపణములు నీవు న న్నడుగుకొనుచున్నావు.

అయినను బుట్టినవాఁడ ననన్య సామాన్యమై సత్యనిష్ఠాగరిష్ఠచే బరిశుద్ధమైన నీమానసమున కింతటి క్షోభ దెచ్చిపెట్టిన నాయట్టి ఘోరకర్ముండు శిక్షార్హుండుగాక క్షమాపణమునకుఁ దగునా ?

హరి—అయ్యో ! విప్రోత్తమా ! శిక్షించుటకుఁ గాని క్షమించుటకుఁగాని నే నెంతటివాఁడను ! వటుశిఖామణీ ! నీకిదే వందనము. (నమస్కరించును)

నక్ష—(లేవనెత్తి)

చ. కలత వహింపకయ్య ! కల ♦ కాలము కష్టములుండబోవు కావలసిన కారణార్థము ల ♦ వంబును దప్పునె ? నా యకృత్యముల్ దలపున నుంచకయ్య విహి ♦ తమ్మున నిన్ క్షమింపుమయ్య, నా కలుషమె యింత కింతి కధి ♦ కమ్మయి న న్వధియింపకుండు నే.

హరి—అయ్యా ! మీరు చేసినదేమున్నది ? నా పూర్వభవసంచిత పాపఫలమే నన్నీ కష్టంబులకుఁ దెచ్చె.

నక్ష—రాజేంద్రా ! నిత్యసత్యసంధుఁడవైన నీకెప్పటికిని గష్టములు లేవు చూడు.

మ. కడఁకన్ గాపలెనంచు సత్యఫలముం ♦ గాంక్షించి నీవే యొడంబడి, నీకై కొన్న విపత్తులం బరితపిం ♦ పన్ గూడఁదయ్యో కడుం గడుదోసంబని నేనెఱింగియు వృథా ♦ క్రౌర్యంబునన్ నీయెడన్ జెడుగు ల్సేయుట కెంత గుందితినో ♦ నాచిత్తంబె తా సాక్షియౌ.

హరి—నక్షత్రేశ్వరా ! దుఃఖింపకుము. పరమేశ్వరుఁడు నిన్ను రక్షించుఁగాక ! వటూత్తమా ! నాకింక సెలవొసంగుఁడు.

వీర—రాఁయ్యా ! హరిచ్చంద్రుఁడా ! కుండెత్తుకుండావా ?

హరి—అయ్యా ! వచ్చుచున్నాను.

వీర—అరే అబ్బిగా ! మద్దానూ ! యింటికాడికి మనోణ్ని తీసుకు పో. బొమ్మడికి సామ్మిప్పిత్తాను.

నక్ష—(స్వగతము) అయ్యో ! నేనెంత కపటకృత్యముల నభినయించితిని ? నన్నీ యకార్యమునకు నియమించునపుడు భగవానుఁడైన విశ్వామిత్రుఁడు నేనిట్టి రట్టునకు పాలగుదునని తలంపఁడయ్యెఁగదా ! ఇనుమునుబట్టి యగ్నికి సమ్మెట పెట్టున్నట్లు గురూత్తమా ! మీవలనఁ గదా నే నిట్టి పని కొడిగట్టవలసివచ్చె. మీయాజ్ఞానువర్తినై నిత్యసత్యవ్రతుఁడగు హరిశ్చంద్ర చక్రవర్తికి లెక్కలేని

యిక్కట్టులఁ జేసేతఁ దెచ్చిపెట్టి నేను మీకుఁ జెల్లింపవలసిన గురుదక్షిణ నిశ్శేషముగాఁ జెల్లించుకొంటిని. కాని నేనిప్పు డన్నివిధముల దిక్కుమాలినవాఁడనై ప్రపంచమునకు రోసి చావక బ్రతికియున్నాను. ఇంకను నాకుఁ దపం బెందుకు ? ఎన్ని మన్వంతరములు తపం బొనరించినను నా యీ దుష్కృతి నిష్కృతి యగు టెట్లు ? హా దీనబంధూ !

గీ. గురుతిరస్కృతి తగదను ♦ కొనుట యొకటి
యతనికార్యంబు నెఱవేర్తు ♦ ననుట యొకటి
యింత నిందకు నన్ ద్రోచె ♦ నేను జనిన
పాయ కది నిల్చు నెన్ని క ♦ ల్పములకైన.

నే నిప్పు డేమి సేయుదు ? నాకింక దిక్కెవ్వరు ? నా పాపంబునకుఁ బ్రాయశ్చిత్త మెద్ది ? భగవానుఁడా ! విశ్వపతీ !

శా. ఏయే ధర్మము లాచరింప నగు, ♦ నేయే క్షేత్రము ల్మెట్టనా
నేయే తీర్థములందుఁ గ్రుంకనగు, నే ♦ యే దేవతలం గొల్వనా
నా యీ పాపము దప్పిపోవుట కనం ♦ తా దీనబంధూ ! కృపా
భూ ! యాపన్నుఁడ నీవె దిక్కగుము కొ ♦ ల్తు న్నిన్ను విశ్వేశ్వరా !

ఇంక దుఃఖించిన నేమి ప్రయోజనము ? మా యుపాధ్యాయుఁడైనను దురుద్దేశముతో హరిశ్చంద్రుని బాధించుచున్నాఁడనుకొనను. తన వైరియగు వసిష్ఠుని సాధించుట కింత సేయుచున్నాఁడు. ఏది యెట్లున్నను మహానుభావుఁడైన హరిశ్చంద్రుని దుఃఖములు తలంచినచో వజ్రకాఠిన్య హృదయములు సయితము నవనీతసమానములు కాకపోవు. పాప మా లోహితాస్యుఁ డా కాలకౌశికుని సేవానిర్బంధమున నెట్లున్నాఁడో ? దైవమా ! సర్వదా హరిశ్చంద్రునకుఁ దోడుపడుము. తోడుపడుము. (ప్రకాశముగా) వీరబాహూ ! ధన మిప్పింతువు గాని పద.

వీర—అయ్యోరు ! రండి. (నిష్క్రమింతురు)

ఇది పంచమాంకము

శ్రీరస్తు

# సత్యహరిశ్చంద్రీయము

## షష్ఠాంకము

రంగము : కాశీపుర శ్మశాన పరిసరారణ్యము.

[పిమ్మటఁ గాలకౌశికుని శిష్యులగు కేశవజనార్దనులతో లోహితాస్యుఁడు ప్రవేశించుచున్నాఁడు]

గేయము - పార్శీమెట్టు

అందఱు—ఆటలాడుదమా చెండాటలాడుదమా
　　వాటమైన త్రోక్కుడు బిళ్ళాటలాడుదమా ॥ఆట॥
　　చెట్టులెక్కుదమా లేక గుట్టలెక్కుదమా
　　అట్టునిట్టు జీరుగుబండలందు జారుదమా ॥ఆట॥
　　కూఁతపెట్టుచు దాఁగిలిమూఁత లాడుదమా
　　ఆతరువుక్రింద గోలీలాటలాడుదమా ॥ఆట॥

లోహి.—మిత్రులారా!

గీ. ఆటలకు వేళలేదు సా ♦ యంతనంపు
టగ్నిహోత్రములకు వేళ ♦ యయ్యె నిప్పు
డయ్యవారలు ముక్కోపు ♦ లగుట మీకుఁ
దెలియునేకద! రండు ద ♦ ర్భలను గోయ.

కేశ.—జనార్దనుఁడా! పాపము! లోహితాస్యుని కీనాఁడెన్నిదెబ్బలు తగిలినవిరా! అందునకే వీఁడు భయపడుచున్నాఁడు.

జనా.—మనలనుగూడఁగొట్టునేమో రండు. తలకొకదారిం బోయి దర్భలఁ బత్రములఁ గోసెదము. (అట్లు చేయుచున్నారు)

లోహి.—(నడచి పూలఁ గోసి) ఈపూలతావి చక్కఁగా నున్నది. ఇవి మాకౌశికుంటకిక్కి తిసికొనిపోయెదను. ఇదిగో నీ పుట్టమీఁద దర్భలు బాగుగాఁ బెఱిగినవి.

అందఱికంటె నేనే యెక్కువ దర్భలను గోసెదను, (పుట్ట నెక్కి కోయు చుండ పాము కఱచును. హా! తల్లీ! హా! మిత్రులారా! నన్నొక్క పెను బాము కఱచినది. (పడిపోవును)

అందఱు—(పరుగెత్తుకొని వచ్చి) నెచ్చెలీ! నీకేమైనది?

లోహి—అన్నలారా! ఇంకేమి కావలయును? నన్నొక్కపాము కఱచినది. ఇంక మాయమ్మను జూచు భాగ్యము నాకు లేదు.

కేశ—అయ్యో, అయ్యో! నీకెంత కష్టము వచ్చెను. జనార్దనా! పాపము! వీనికి మత్తు వచ్చుచున్నది. చెమటలు శరీరమునుండి యూఱక కారుచున్నది. నోట నుఱుగులు పడుచున్నవి. కొంతవడి విసరనైనవిసరుదము (అట్లే చేయుచుండ)

లోహి—(కొంచెము తేఱి) అన్నలారా! చింతింపకుఁడు. నా యదృష్టమునకు మీ రేమి చేయఁగలరు? మీ రిక్కడ నామూలమున మసలవలదు. మీకు మాట వచ్చును.

సీ. జాగయ్యెనని కొట్టు ♦ నో గురుం డట మిమ్ము
నిచట నుండక యింటి ♦ కేగరయ్య
అతిభక్తి మీకు లో ♦ హితుఁ డంపినాఁడని
యీ కుశ ల్గొరున కం ♦ దీయరయ్య
సదయులై నారాక ♦ కెదురుచూచెడి తల్లి
కీ నాదుగతి వచి ♦ యింపరయ్య
యేదిక్కులేక నే ♦ నే లోకముని యున్న
జనని దుఃఖము బాపి ♦ మనుపరయ్య
వీలుగానున్న గురునొప్పు ♦ కోలుమీఁద
నమ్మ నొకసారి చూచి పో ♦ మ్మందురయ్య
విసము తలకెక్కె నేను జీ ♦ వింపనయ్య
కడకిదే మీకు నా నమ ♦ స్కారమయ్య!

నెచ్చెలులారా! నా ప్రాణములు లేచిపోవుచున్నవి. మీ రింకఁ బొండు. హా! తల్లీ నీవైన నాదగ్గఱ లేకుంటివే?

జనా—అయ్యో, అయ్యో! ఎంతపని జరిగెను?

కేశ—మనమీఁద కేమి రాదుకద. జనార్దనా!

జనా—మనము పోయి పాపమా చంద్రమతి కీసంగతి నెఱిఁగింతము. మన మిక్కడి యుండి చేయున దేమున్నది? (నిష్క్రమింతురు)

[పిమ్మట చంద్రమతి పిడక లేరుచుఁ బ్రవేశించు చున్నది]

కటకటా! ఎంత మందభాగ్యురాలను! నిరంతర మనంత పరిచారికాశతంబులయూడిగంబు లందికొను పట్టంపురాజ్ఞిపదం బనుభవింపఁజేసి, దైవమా! తుద కీనీచ గతికేల పాల్పఱచితివి? తొలుత నే నన్నీలాటి దాసిగ సృజించిన నీవు నాకెంత యుపకార మొనరించిన వాఁడవగుదువు! ఈదాసికావృత్తియందైనను నాయజమానురాలిని మెప్పింపలేకుంటినే! హా! ప్రాణపతీ! హరిశ్చంద్రా! నీవిప్పు డెందున్నావో కదా! కాలకౌశికునికి న న్నొప్పగించునప్పుడు మన సార మనకష్టములఁ దలంచుటకైన వీలులేకపోయిననుఁ గడకు మందభాగ్యురాలనగు నేను.

సీ. యజమాని బ్రా ♦ హ్మణుని తీవరముచే
నింపార మిముఁ గౌగి ♦ లింపనైతి
నిబిడాశ్రువులదృష్టి ♦ నిలుపలేకుంటచేఁ
గనులార మిముఁ జూచు ♦ కొనగనైతి
దుఃఖంబు పొంగి కు ♦ త్తుకబంటియౌట నో
రార మీతోడ మా ♦ టాడనైతి
మసలినన్ వడుగుచే ♦ మాట వచ్చునటంచు
నొక్కింత మీదండ ♦ నుండనైతి
కడకు న న్నొప్పగించి యీ ♦ కర్మమునకు
ముందుఁ బోలేక పోలేక ♦ పోయినాఁడ
వెందు నున్నాఁడ వేగతి ♦ నొందినాఁడ
విలను నున్నాఁడవో లేవో ♦ యినకులేశ.

అక్కటా! శోకతీవ్రతచే యజమానురాలి యాజ్ఞను మఱచుచున్నాను. ఇంతఁ దొందరగాఁ బిడక లేరవలయును. (ఏరుచు) ఓహో! సాయంకాలమై పడమటి కొండ యందలి సంజకెంజాయ విశ్వామిత్రుని కోపరసమో యనఁ బ్రకాశించుచున్నది. మఱియు

మ. కొడుకస్తంగతుఁ డయ్యె నంచుఁ దెలివిన్ ♦ గోల్పోవునన్ గన్న
ప్రేముడిఁజింతించెడి లోకబాంధవునకై ♦ పూర్వాశప్రాణేశుఁడే
య్యేడకోపోయె నటంచుఁ బద్మినిసదా ♦ భృంగీరవవ్యాపృతిన్
ద్గోడఁగెన్ మోముముడించి యేడ్వనెటుబంధు త్యాగమిం[illegible]

కాని వడుగులతోఁ గలసి యడవి కేగిన నా లోహితాస్యుఁ డింకను రాకున్నాఁడే మొకో? రావలసినవేళ గూడ నతిక్రమించుచున్నది. అదిగో!

శా. ఆవుల్ మందలలోన నిల్వక వెయం ♦ బా యంచు లేదూడలన్
ద్రావింపన్ దమ చేఁపు బాలు వడి నిం ♦ డ్లన్ జేరెడిన్ ముక్కులం
దేవో ధాన్యపుఁ గంకులందికొని య ♦ ద్దే గూండ్లకున్ జేరె నా
రావంబు ల్చెలఁగన్ బులుంగు లకటా! ♦ రాఁడేమి నా పాపఁడే?

నేఁ డేకారణముననో నామనంబు పరిపరివిధములఁ దపించుచుఁ గీడునే శంకించుచున్నది. తొలుతఁ గుఱ్ఱవానిని స్వామి యడవికిఁ బంపునప్పుడు బాల్యచాపల్యముచే వాఁడు "నే నడవికిఁ బోలేనన్న" మాత్రమున ముక్కోపియైన కాలకౌశికుఁడు చబుకుం బట్టుకొని,

మ. 'చెడుగా! యేపని చేతగానియెడ ♦ నాచేనాన్ ముప్పూటలున్
గడుపుబ్బ న్నిను మేపనంచు దనువున్ ♦ గాయాలుగాఁ గొట్టినన్
బడలే కావ్యధ ప్రాణభీతి 'గురుడ ♦ మ్మా! చూడదే' యంచు నా
కడ కేతెంచిన పుత్రు కష్టగతి నా ♦ గర్భంబు ఛేదించెడిన్.'

దైవమా! యెంత నీచదురవస్థకుం దెచ్చితివి? ఏదియెట్లయినను గుఱ్ఱవాఁడింకను నా కంటఁబడలేదుగదా! చెడుదినములు గాన నామనంబు ప్రతిక్షణము శంకించుచునే యున్నది. (ప్రక్కఁ జూచి) వారే వడుగు లందఱు వచ్చుచున్నారు. అక్కటా! కోసినదర్భలు మోయలేక కుఱ్ఱవాఁడు వెనుకంజిక్కెఁ గాఁబోలు! నేను వానికి సహాయము పోయెదను. (ఎదురుబోయి) ఏడి నాలోహితుఁడు? బ్రహ్మచారులు మాత్రము గనఁబడుచున్నారు గాని నా ముద్దులయ్య లోహితుండు కనంబడఁడే?

[వడుగులు ప్రవేశింతురు]

కౌశి—జనార్దనా! పాపము చంద్రమతి యిక్కడనే యున్నదిరా?
జనా—అయ్యో! ఈదారుణవార్త యేమని వచింతుము?
చంద్ర—అన్నలారా! మా లోహితుఁ డెక్కఁడ?
బ్రహ్మచారులు—(ఊరకుందురు)
చంద్ర—ఏమి నాయనలారా! మాటాడరు? మఱేమి యప్రియము లేదుగదా?
కౌశి—జనార్దనా! చెప్పుము.
జనా—నీవే చెప్పరా.
చంద్ర—అయ్యలారా! మిమ్ముఁ జూచిన మాకడుపు బ్రద్దలగుచున్నది. మా ప్రియమిత్రుఁడు లోహితాస్యుఁ డేమయ్యెనయ్యా?

కేశ—అమ్మా! మే మే పాపకర్మ మెఱుఁగము. మే మందఱ మడవిలో దర్భలు కోయుచుండ "మిత్రులారా! నన్నొక పెనుఁబాము కఱచినది" యను మీ లోహితాస్యుని దీనారవము మాకు వినంబడినది. అంత మేము పోయి చూతుముగదా సర్పదష్టుఁడై మరణవేదనఁ బడుచున్న నీ కుమారునిం జూచితిమి.

చంద్ర—హా! తండ్రీ! లోహితా! నే నిప్పుడు చచ్చితినిరా. (మూర్ఛిల్లును)

కేశ—అమ్మా! ఇంకఁ గొంచెము చెప్పవలసియున్నది.

చంద్ర—నాయనా! ఇంకేమి చెప్పవలయు?

కేశ—అప్పుడు స్పష్టముగా లేనివాక్కులతో నిట్లు చెప్పినాఁడు.

చంద్ర—ఎట్లు తండ్రీ!

కేశ—(జాగర్యోనను పద్యము చదువును) అట్లు చెప్పునప్పుడు మరణవేదన పడుచుండె. ఇప్పు డెట్లుండెనో తెలియదు. ఎట్లయిన నీ కుమారుని నొక్కమాఱు చూచుకొనిరమ్మా. ఇదిగో, ఈమార్గమున సూటిగాఁ బోయితివేని నీకొక వటవృక్షము గాన్పించు, దానినీడయందే నీనందనుండు పడియుండు. మేమింకఁ బోయి వత్తుము. మాకచట మాట వచ్చును.

చంద్ర—అయ్యలారా! పొండు. నాదురదృష్టమునకు మీరేమి చేయుదురు?

(బ్రహ్మచారులు నిష్క్రమింతురు)

చంద్ర—హా! కుమారా! లోహితా! నీకు మృత్యుదేవతయై యా కాలసర్పమెక్కడ దాపురించెనోయీ తండ్రీ! అడవి కేగునప్పుడు "నేను నడువలేనన్నను నన్ను గురుండు బలవంతముగాఁ గొట్టుచుఁ బొమ్మనుచున్నాఁ"డని నీవెంత చెప్పికొన్నను నింట నే నిల్పికొనఁజాలని నేను నిన్నుఁ జూడవచ్చుటకు మాత్ర మెట్లు స్వతంత్రురాల నగుదు? కొడుకా! నీవు నన్నుఁ బూర్ణముగా విడిచిపెట్టితివా? హా! విధీ! పతి వియోగముచేత నే యిదివఱకుఁ గృశించి కృశించి యెప్పటికైనా మా హరిశ్చంద్రునిఁ జూడకపోదునా, యెల్లకాలము గష్టములిట్లే యుండునా యను నొండిధైర్యముచే నెక్కడనో యొక్కప్రాణముతోడ నీలాగు జీవించియున్న నాగర్భమునఁ బుత్రవియోగాగ్నియుఁ దరికొల్పితివా? నాకింక దిక్కెవ్వరు? హా! ప్రాణేశ్వరా! హరిశ్చంద్రా! నీవిప్పు డెక్కడ నున్నావు? కాలవైపరీత్యముచే నీకుటుంబ మంతయు దిక్కుమాలి నేఁటికిఁ జెట్టున కొక పక్షియై రాలిపోవలసి వచ్చెనే! అయ్యో! దుఃఖభారముచే సేవాకృత్యమును మఱచుచున్నాను! స్వామియాజ్ఞం గైకొని కొడుకు పడియున్న చోటునకైనఁ బోయి చూచివచ్చెదను. అమ్మా! కాలకంటకీ! నీవిప్పు డేమందువో?

కాలకం—(ప్రవేశించి కోపముతో) ఓసీ, అంసనారీ ! నీవిల్లు కదలి ఎంతసేపైనదే? పిడకలేరుకొని రమ్మని పంపగా సుఖముగా నిక్కడఁ బ్రొద్దులుపుచ్చుచున్నావా? ఓసీ ! నీకు మాసొమ్మెంత విషమైనదే? ఈతీరుగాఁ బనికొడలు దాఁచుకొని యింటికేముఖము పెట్టుకొని తిండికి రావలయు ననుకొన్నావు ?

చంద్ర—అమ్మా ! కోపింపకుము. నేను మీ యానల శిరసావహించియే పనిచేయుచున్నాను. నేఁడు నాదురదృష్టము పండి దర్భలకై యడవి కేగిన నాకొడుకును పాము కఱచినదఁట.

కాలకం— ఓసీ ! సూత్రధారీ ! తొందరగా నెందుకుఁ బనిచేయదన్నందునకీపన్నాగము పన్నినావు ? ఛీ ! ఛీ !

చంద్ర—అమ్మా ! నే నబద్ధ మెన్నటికి నాడనమ్మా ! దర్భలకై పుట్ట నెక్కఁగా నాకొడుకును బాము పట్టెనఁట.

కాలకం—ఎవరు చెప్పిరి ?

చంద్ర—వెంటఁబోయిన వడుగులు చెప్పిరి.

కాలకం—అయ్యో ! మాకు ధనవ్యయంబు గలిగింప నీ వెక్కడ దాపరించితివే! బోలెడు సొమ్ము పోసికొనిన మేము నీ జీవనమునకు దేవుఁడా యని యేడ్వవలసియుండగా నీకెందులకే యీ యేడుపు ?

చంద్ర—అమ్మా ! కన్నకడుపుగదా !

కాలకం—అట్లయిన నిప్పుడేమి చేయుమందువు ?

చంద్ర—కుఱ్ఱవాఁడు పడియున్నచోటి కేఁగి చూచి వచ్చెదను. సెల వీయవలయు.

కాలకం—ఓసి నిర్భాగ్యురాలా ! ఇంటిలోఁ జేయవలసినఁ బను లెన్నియో ముందుఁ బెట్టుకొని యెక్కడికో పోయెద ననుటకు నో రెట్లాడెనే ? నీవు పోయిన తరువాత నీపనియంతయు నీతాత ఎవరు చేయును ? ఊరక నోరు మూసికొని నావెంట రమ్ము.

చంద్ర—తల్లీ ! కాలకంటకీ !

మ. కడప్రాణంబున నున్నవాఁడో, విస ♦ మెక్కన్ జచ్చెనో కానలోఁ
గొడుకమ్మా ! ననుబంపకుండినను యోగ్యం♦బైన వైద్యం బ్వరం
బడియచ్చోటికిఁ బంపుమమ్మ ! బ్రతికిం ♦ పన్ జాలునేమో సుతున్
గద కాళ్లంటి నమస్కరింతు సుత భి♦క్షం బెట్టి రక్షింపుమా.

కాలకం—చాలుఁ, జాలిదివరకుఁ దిన్నది చాలక మా సొమ్మింకను గుండము వేయుచున్నావా ! దర్భలకై పోయినవాఁడు పుట్టలెక్కుట యెందులకు ? పాము నోటికి-గాలందియ్యఁగాఁ గఱవక ముద్దు పెట్టుకొనునా ! కల్లకుండునట్లు

దేశములోనిపాములకన్నింటికి నాకట్టు కట్టకుండుట మాదొకతప్పాయేమి? నీకొఱకై వైద్యు నెవ్వరి నిక్కడ సిద్ధముగా నుంచలేదు. మాకు మందులు చేతఁగావు. ఇంటిలోఁ బనులన్నియుఁ జక్కబెట్టి రాత్రి మమ్ము నిదురపుచ్చి నీ వెక్కడికైనాఁ బొమ్ము. (పోవుచున్నది)

చంద్ర—అమ్మా! నీ సెలవైనట్లు. (నడచుచు) హా! జీవితేశ్వరా! హరిశ్చంద్రా! నీవు గూడ సేవానిర్బంధమున లేవుగద! (అని నిష్క్రమించును)

[పిమ్మట నొకకుండ మూఁపుపైఁ బెట్టుకొని హరిశ్చంద్రుఁడు ప్రవేశించుచున్నాడు]

స్వామియగు వీరబాహుఁడు నన్ను "హరిశ్చంద్రుఁడా! కాదు కాదు, వీరదాసుఁడా నేఁటిరాత్రి యంతయు వల్లకాటియందుఁ గావలియుండిఁ యుదయమున నింటికి వచ్చునప్పు డీకుండనిండఁ గొత్తకల్లు నింపుకొని రమ్ము"అని యీసురాభాండమును నా కిప్పించినాఁడు. ఆహా! సురాభాండమా! నీవు పూజ్యురాలవు. కావున నో విశ్వామిత్రుని సహాయసంపత్తిచే విశ్వవిశ్వంభరాదేవికి నాస్థానంబగు నీభుజపీఠిపై నిట్లధిష్ఠించియున్నావు. కాని! నేనిప్పుడు శ్మశానవాటికకే వెళ్ళెదను. అంధకార మప్పుడే బ్రహ్మాండ మంతయు నావరించి కన్నులున్నవారిఁ గూడ గ్రుడ్డివాండ్రను చేయుచున్నది.

సీ. కలవారి యిండ్లలో ♦ పలి నిధానము నెత్త
నరుగు దొంగలకు సి ♦ ద్ధాంజనంబు
మగలఁ గూరుక నిచ్చి ♦ తెగి యంటుగాండ్రకై
తారాడు కులటల ♦ తార్పగత్తె
అలవోక నలఁతిపి ♦ ట్టల బట్టి వేటాడు
పాడుఘూకములకుఁ ♦ బాడిపంట
మసనంబులోన నిం ♦ పెసలారు శాకినీ
ఢాకినీ తతుల చు ♦ ట్టాల సురభి
కేలతాంగికి నల్లని ♦ మేలి ముసుఁగు
కమలషండఁబునకు నెల్ల ♦ గన్నుమూఁత
సత్యవిద్రోహి దుర్వాశ ♦ శ్ఛవికిఁ దోడు,
కటికచీకటి యలమె ది ♦ క్తటములందు.

ఇఁకఁ ద్వరపడి శ్మశానవాటికకే పోయెదను. (పిమ్మట శ్మశానభూమి కాన్పించును)
అహా! ఈశ్మశానంబునం దెచ్చటఁ జూచినను,

సీ. కాఁబోలు బ్రహ్మర • క్షస్సమూహం బిది
ఘోషించుచుండె ఋ • క్కులక్రమంబు
కాఁబోలు వీరు వి • తజీవబాంధవు
లడరుచుండిరి మహా • ర్తారవములఁ
గాఁబోలు వీఁడు ట • క్కరి భూతమాంత్రికుల్
నెమకుచుండిరి కపా • లములకొఱకు
కాఁబోలు నిది పిశా • చీబాంధవశ్రేణి
పలలంపు బువ్వంపు • బంతిసాగె
చిట్లుచున్నవి కాఁబోలు • చితులలోన
గాల్పఁబడెడు శవాల కం • కాళ సమితి
నెటఁ బెఠీలను రవము లే • యెసఁగుచుండు
దిక్కుల న్నిండ మార్మ్రోఁత • పిక్కటిల్ల.

ఎవ్వరచ్చట ? నాకెదురుగా నిలుచున్నారు? పిలిచి చూచెదను ఓహో ! ఎవరువారు ?

గీ. కాటిసుంకంబు చెల్లింప • కయె శవాల
మసనమునఁ గాల్ప రేకద • మనుజులార ?
కాపులే దనుకొంటి • రే మోపదుండు
దళిత ఘోరారి యీవీర • దాసు గలఁడు.

(అని నడచి) ఓహో ! ఎంత పొరబడితిని ? సగము కాలుచు బరువులేక నిట్టనిలువునఁ బైకి లేచిన యీశవమును బ్రాణిగా భావించితి. అయ్యో ! ఈకళేబరపు దుస్థితి యెంత జాలిం గొలిపెడిని.

శా. మాయామేయజగంబె నిత్యమని సం • భావించి మోహంబునన్
నాయిల్లా లని నా కుమారుఁ డని ప్రా • ణంబుండునందాక నెం
తో యల్లాడిన యీశరీర మిపు డిం • దుం గట్టెలఁ గాలుచో
నాయిల్లాలును రాదు పుత్రుఁడును దోఁ • డై రాఁడు తప్పింపగన్.

ఇట్టి శ్మశానములం గనినపుడెల్ల నీలాటి వైరాగ్యములు కలుగుచుండుట సహజమే. ఇఁక నా మంచెదగ్గఱకుఁ బోయెదను. (నడచుచు) అయ్యో ! దారి బొత్తుగా

నిర్ణయింపలేకున్నాను. ఈచితిలోని కాష్ఠమును నే నిప్పుడు దీపముగా నుపయోగించుకొనియెద. (అని కొఱవిం గైకొని) ఆహా! చక్రవర్తులకు సేవకాజనముపట్ల బంగారపు కరదీపికలకంటె నాయిప్పటి నీచస్థితికి నీకొఱవియే మిక్కిలి యుచితమైనది.

శా. కాలంబుంగతి నెప్పు డేది యెటు భో ♦ గ్యం బప్పు డప్పాటనా
నాలీలన్ మును సేతు శీతనగ మ ♦ ధ్యప్రాచ్య సామ్రాజ్య హే
లా లీలానుగతిన్ జరించి యిపు డీ ♦ లాగైన నా ప్రాప్తికిన్
నాలో నాకొకభంగి నవ్వగు దురం ♦ తంబైన దుఃఖంబుతోన్.

మఱియు,

మ. చతురంభోధి పరీత భూవలయ ర ♦ క్షాదక్ష చామీకరా
యతదండంబు ధరించు నీకర మెయా ♦ హా! యిప్పుడిక్కాటిలో
జితిలోఁ గాలుచున్న నీకొఱవి దా ♦ ల్చెన్ నవ్యమాణిక్య రా
జిత నీరాజనకాంతికిన్ బదులు వ ♦ చ్చెన్ శోచనీయంబుగన్.

అయ్యో! ఈకొఱవి యప్పుడే యాఱినది! పోనీ! పాఱవైచెదను. (అని మెల్లగా నడచి) ఓహో! ఇదే శ్మశాన రాజ్యాభిషిక్తుఁడ నగు నాసింహాసనము (అని నేనిక్కడ సోమరితనమునఁ గూర్చున్న నిద్దురవచ్చి స్వామి కార్యంబునకు భంగము కలుగుగదా! అయ్యో! నాకును నిద్రాహారములకును ఋణము తీఱి యెంతకాలమైనది? సుగుణవతియు నా యర్ధాంగలక్ష్మియు నగు చంద్రమతిం గొడుకుతో నొక్కనికి దాసిగా నప్పగించుకొంటినో నాఁటితో నాకును నా సౌఖ్యమునకును ఋణము దీఱినది. మొండిపడి ప్రాణముమాత్రము వెడలిపోకున్నది. ప్రాణము పోయిన నీదుఃఖములన్నియు నెవ్వరనుభవించువారు? ఆహా! దైవోపహతుఁడనై నే నిప్పు డెన్నివిధముల బాధింపఁబడుచున్నాను.

మ. అకటా! యొక్కనిపంచ దాసియయి య ♦ ట్లల్లాడు నిల్లాలి పా
ట్లకునై కుందుదునా? సువర్ణమయ డో ♦ లాకేళికిం బాసి
పొట్టకునై రోసితపించు నాకొడుకు జా ♦ డం గాంచి దుఃఖింతునా?
యిక నీనీచపు గాటికాపరిని నా ♦ కే నేను శోకింతునా?

హా! హా! లోకములోని కష్టము లన్నియు నన్నే కోరి వరించినట్లున్నవి. కాకున్న నన్నికష్టము లెవ్వరనుభవింతురు? అయ్యో! ఈనిర్భాగ్యపుహరిశ్చంద్రుండు గతించినవెనుక మరల కష్టములకుఁ దా వెక్కడ దొరకునో! రాజ్యవియోగంబునకై దుఃఖింపను; మహారణ్యవాసాదిఘోరదుఃఖంబు లెన్ని సంభవించినను గణింపను; కడకతినీచతంబగు నాయీచండాల దాస్యంబునకు గూడఁ

బరితపింపను; కాని చేపట్టినదాది నన్నే పరమదైవంబుగ భావించుచు నా మూలమునఁ దన కంతలేసి కష్టములు సంభవించినను క్షమాగుణసంపత్తిచే సహించుటేకాక తన్ను నొక్కనికిఁ దెగ నమ్ముకొనుట నీచం బని నేసంకోచించినప్పుడు "నాథా! సత్యప్రతిష్ఠకై యొనరించు నీచకృత్యంబులు సగౌరవంబులే యగు" నని నాకు నుత్సాహము కలిగించి నాసత్యదీక్షం గాపాడిన నాయర్ధాంగలక్ష్మియగు చంద్రమతీదేవి వియోగదుఃఖము నే నేగతి భరింతు? హా! దేవీ! అసూర్యంపశ్యా! నీ రాణివాససౌఖ్యం బేమయ్యెను! అయ్యో! సాధ్వీమణీ! నీ పతి బ్రతికియుండగను నీ వనాథవై యొక్కని దయకుఁ బాత్రురాలవు గావలసివచ్చెఁ గదా! హా! కుమారా! లోహితా! నిన్ను మరల నే నెన్నఁడు జూడఁగలుగుదు? తండ్రీ! దాసదాసీజనంబుల జేతుల నుండి యడుగటు పెట్టనీక మిగుల గారాబమునఁ బెంచిన నిన్నట్టి నిష్ఠురతమంబగు దాస్యంబున కొప్పగించితిఁగదా! అక్కటా! నాదుఃఖ మంతకంతకు మితిమీఱుచున్నది. కడచిన విపత్తు లొక్కటొక్కటిగఁ దలంపునకు వచ్చి నాధైర్యమును మఱింత మాపుచున్నవి. ఆహా! ఆనాఁడు నాభార్యాపుత్రులఁ గాలకౌశికునకు విక్రయించునప్పుడు "దాసీ! కదలవేమి" అని యప్పారుఁడు తనతల్లి నదలించినాఁడని మాలోహితుఁడు "ఓరీ! మాయమ్మ నెక్కడకుఁ గొనిపోయెదవురా!" యని తనపై నదరినాఁడని యా కాలకౌశికుఁడు నిర్దయుఁడై,

మ. 'కుడువం గూటికి లేకపోయినను నీ ♦ కున్ రాజసం బెంత హెం
చ్చెదురా? ఛీ! తలకెక్కె నే పొగరుడా ♦ సీపుత్ర యంచున్ సుతున్
బడద్రోయన్ గొడుకట్టె నావదనము ♦ న్గన్నీళ్లతో జూచె హా!
కడుపున్ ఱంపపుఁగోత గోయునదియే ♦ గాయంబు గాకుండగన్.

అయ్యో! అట్టి దురవస్థనుండి సతీసుతులం దప్పింపలేక పోయితివిగదా! నాకై గదా రారాజుబిడ్డయగు నిల్లాలు దిక్కుమాలి పరులకొంపలఁ జాకిరికత్తెయై యల్లాడుట ఛీ! ఛీ! కఠినాత్మా! హరిశ్చంద్రా! నీ జన్మము నిజముగా నిరర్థకమైనది. చూడు.

సీ. విడలేక నీవెను ♦ వెంట వచ్చెదనన్న
పౌరుల దుఃఖము ♦ ల్బాపినావా
సరి రాచబిడ్డయా ♦ సతిని నిల్లాలిని
బ్రియమారఁగా సుఖ ♦ పెట్టినావా
గడుపారఁ గన్న యా ♦ గొడుకును ముద్దుగాఁ
బెంచి ముచ్చటలఁ జె ♦ ల్లించినావా

పుత్రవత్సలత న ♦ ప్పుడు నన్నుఁ బ్రేమించు
కులగురు నాజ్ఞలో ♦ మెలఁగినావొ

సీ. రవి మొదలుకొని నీదాకఁ ♦ బ్రబలుచుండు
స్వకులగౌరవములను గా ♦ పాడినావొ
చావకెందుకు ఛీ! హరిశ్చంద్ర! నీవు
బ్రతికియున్నావు జీవచ్ఛ ♦ వంబ వగుచు.

అయ్యో! ఎంత వైపరీత్యము జరిగెను! ఎప్పటికైన శుభదినములు రాకపోవునాయను ధైర్యముగూడ నంతరించినది. బ్రతికియున్నంతవఱకు దేవి కౌ దాస్యదుఃఖంబును. నాకీ కాటికాపరి యుద్యోగమును నవశ్యానుభోక్తంబులేకదా!

శా. నా దాసీత్వముఁ బాపి యెప్పటికినై ♦ నన్ జింత లీడేర్చ్వడే
నా దేవుండను నాసతో నసువుల ♦ న్బారంబుగా మోసి నే
నేదిక్కాదని నమ్మియుండు సతి నా ♦ హీనస్థితిన్ గానమిన్
ఈదార్భాగ్యపుఁ గాటికాపరితనం ♦ బేపాటి తన్ బ్రోచెడిన్.

అకటకటా! మందభాగ్యుఁడనైన నాచిత్తమునకు శాంతి యెప్పటికో? అయ్యో! ఇంక శాంతి గాకేమున్నది?

శా. నానాటన్ బరిపాటి నామది దురం ♦ తంబైన చింతాహతిన్
మానై రాయయి వజ్రమై స్వగుణధ ♦ ర్మంబైన చైతన్య లీ
లానైజంబు ద్యజించి నిర్వికృతి మే ♦ ళ్లన్ గిళ్ల నొక్కమ్మడిన్
బూనున్ యోగిమనంబురీతి యపుడే ♦ పోశాంతి నాచింతకున్.

కావున నింక దుఃఖించినమాత్ర మేమి ప్రయోజనము? సత్యస్థైర్యుఁడనైన నే నింక ధైర్యము నే వహింపవలయుఁ అయ్యో! ఏమిది? దుఃఖప్రాబల్యమునఁ గర్తవ్యంబు మఱచితిని. (శ్రుతి నభినయించి) ఎక్కడినుండియో యాదీనారవంబ శ్రవణగోచర మగుచున్నది పోయి చూచెదఁగాక!

[పిమ్మట నొకమూలనుండి చంద్రమతి ప్రవేశించుచున్నది]

చంద్ర—అయ్యో! ఈ యర్ధరాత్రమున నా కుమారుని జాడ నెవ్వరి నడుగుదును? దిక్కులేని నాకుఁ బ్రకృతియే తోడు గావలయు,

సీ. జలదమా! సుంతమా ♦ ర్వలికిన దోసమా
యెఱుఁగవా నీవు లో ♦ హితుని జాడ
పరుగుత్తకుము చక్ర ♦ వాకి! యేకడనైనఁ
గనుగొంటివమ్మ నా ♦ కన్నవానిఁ
గాసంత మెఱపించి ♦ మోసగించెదవేల
తోడ్కొనరావమ్మ వి ♦ ద్యుల్లతాంగి!
జలదంపుదెరఁ బాసి ♦ వెలికి రం డొక్కింత
తారలారా! నాకుమారుఁ జూప
కానవా వాని గంగాభ ♦ వాని! సుంత
గోల చాలించి వినుము నా ♦ గోడు కొంత,
వేగఁ గాన్పింపుమయ్య యో ♦ విశ్వనాథ!
నీకుమారునిఁ బోలిన ♦ నాకుమారు.

అయ్యో! గతిచాలనివేళ నామాట నెవ్వరు పాటింతురు? హా! సుతా! లోహితా! నీ వెక్కడ నున్నావు తండ్రీ! మునికుల పవిత్రా! గాధిపుత్రా! మ మ్మెంతయైన సాధింపుము. ఒక్కమారు నాకుమారుం జూచుకొననిమ్ము. (నడచుచు) ఏమిది? కాలి కేదియో మెత్తని వస్తువు తగిలినది. నాకుమారునీ శరీరము కాదుగదా? (పరికించి) హా! లోహితాస్యా! నీ కింతటి యవస్థ సంభవించెనురా కొడుకా! పలుక వేమి? అయ్యో! ఇంతటి కంటకములచేత నిదివరకె నొత్తుకొనుచున్న నీ మృదుశరీరము కఠినంబగు నా పాదతాడనంబుచేత నింకెంత బాధపడుచుండెనో! తనయా! పుట్టినదానయే కష్టము లెఱుంగని నిన్ను గురుం డడవికిఁ బంపుచుండగా నూఱకుంటినని నాపై నలిగితివా? లేకున్న నాతోడ నీవేల మాటాడవు? నాయనా! శరత్కాల పూర్ణిమారాకానిశాకరబింబంబు విడంబించు నీముద్దుమోము చిఱునవ్వువెన్నెలచే నలరారుచుండఁ గనులార జూడకున్న నమృతరసంబునకే లభింపరాని మాధుర్యంబు జిలుకు నీముద్దులపలుకులు చెవులార వినకున్నను బ్రతుకున కింకేమి యున్నది తండ్రీ! నే నింకెవ్వరినిఁ జూచి పుడమిపై జీవించియుందు? నాకింకెవ్వరు దిక్కు? రాజ్యసుఖాద్యుత్తమభోగంబులను బాసి చేసికొనిన పతికి దూరస్థురాలనై యొక్కయింట నూడిగంపుగత్తెనై కాలముగడపు నీచస్థితికి వచ్చినను గడుపునఁ బుట్టిన కుమారుఁడవు, సకలలక్షణలక్షితాకారుఁడవు, వంశైకవిస్తారుండవుఁ నీ వొక్కఁడవు గట్టిగా నున్నాఁడ వంతియే చాలునని ప్రాణము

అన్నియు నీమీఁదనే నెలకొల్పి బ్రతుకుచున్న నన్నిప్పుడే సముద్రమునఁ
ద్రోసిఁబోయెదవు తండ్రీ! దాసదాసీజనము లూఁచు బంగారుతూఁగుటుయ్యె
లపై సుఖనిద్రం జెందు సౌఖ్యమప్పుడే యంతరించినను నీవు నాకాలకాలకుని
యింటఁ బండుకొనుటకు నాపైఁటకొంగైనా నింత యాధారము దొరకుచుం
డునే. నేఁ డేదియు లేక దట్టముగా సుండులచే నిండియుండిన యీ నట్టడ
విలో నీయర్ధగాత్రమున నిట్లొంటిగ నిద్రించుచుంటివే వోయీ! కొడుకా!
లోహితా! నీవు నేఁటికి గులకఱాలనేలయే పూలపాన్పయ్యెనా! అయ్యో!
క్రూరసర్పమా! నే నిన్నేమంఁటును? నిష్కారణముగ నాకుమారునిఁ జంపి
తివి ఛీ! సర్పాధమా!

మ. పని యేమున్నది నిన్ననన్ నడకలా ♦ క్రంబు, లెప్రొద్దు నీ
వని ఘోరవిషంబు గ్రక్కుట; జగ ♦ త్ప్రాణినాశనోద్వృత్తి బె
ట్టిన పేరే, యదిగాక నాలుకలు రెం ♦ టిం దాల్చినా విట్టి నీ
కనుకంపాగుణ ముండునన్న నెటు సా ♦ ధ్యంబౌను దర్వీకరా!

అయ్యో! శోకాతిశేకముచే నీపామును దూషించుచున్నా నేమి? ఇప్పటికి రాత్రిలో
మూఁడవజాము జరుగుచున్నట్లున్నది. తెల్లవారకమునుపేఁ గంటికిఁ గనఁబడ
కున్న దొరసాని యూరకుండదు కొడుకా! ఇఁక నీనవమన్మథాకారమును
జూత మనుకొన్నను సంభవింపదే యని యిప్పుడే తనివితీరఁ జూచుకొనుచు
నీశవముకడఁ దడవు నిల్చుటకైన నేనిప్పుడు స్వతంత్రురాలను గాకుంటినే?
నాయనా! రమ్ము! లోకాచారముల ననుసరించి నిన్నుఁ జేతులారఁ గాటి
కప్పగించి చేతులు గడుగుకొనియెద. (ఎత్తుకొని) అయ్యో! ఇప్పుడు శ్మశాన
వాటికకు నేదారియని పోయెదను? పుత్రశోకంబున నావరింపఁబడిన హృద
యమువలెనే బ్రహ్మాండమంతయు నంధకార బంధురంబైయున్నది. లోహితా
స్యుఁడను నాబాలమార్త్యం డస్తమించినవెనుక లోకమున నంధకారముగాక
నింకేమున్నది? (నడచుచు) అవంక నేదియో వెలుతురు గానవచ్చుచున్నది.
నరసంచారములేని యీకాంతారమున నీమానిసి యలికిడిలేకపోయినను దిక్కు
లన్నియు వ్రక్కలగునట్లు పిక్కటిల్లుచున్న గంగానదీఘోషంబులును, నీనట్ట
డవియందలి ఝిల్లీనినదంబును నా గుండెలు బ్రద్దలగునట్లు చేయుచున్నవి.
(నడచుచు) ఆ వెలుతురున్నచోటె శ్మశానవాటిక కాఁబోలు! ఆప్రక్కకే
నడచెదను. అహో! ఇదే శ్మశానవాటిక అయ్యో! సాహసంబు చేసి ఇచ్చ
టికి వచ్చితిని? ప్రాణంబులకు రోసి నాకు సాహసంబు గాక ఇంకేమున్నది
కులవర్ధనుఁడగు నీలాటి కొడుకిట్లు కాటిపాలైపోయినవెనుక నే నింకను
బ్రతికి యేమి ప్రయోజనము? తనయా! నీవిచ్చటఁ బండుకొనుము. నీదహన
కార్యమునకై నిన్ని చితుకులైనఁ బోగుచేసెదను. (అట్లు చేయుచు) హా!
ప్రాణపతీ! ఇట్టి కష్టకాలమునఁ గూడ నీవు దగ్గఱ లేకుంటివే.

[ప్రవేశము : హరిశ్చంద్రుఁడు]

గీ. హృదయమున దుఃఖ మింతేని ♦ బదిలపడదు
మఱతునన్న సతీసుతు ♦ ల్మఱపురారు
కంటి కిదియేమొ పలుమాఱు ♦ గానిపించు
నెక్కడోయున్న నాదు లో ♦ హితుఁడు నేఁడు.

చంద్ర—హా! సుతా! నన్ను వదలిపోయితివా?

హరి—అహో! యెక్కడిది యీ దీనారవము! ఇది పరికింపఁగా సతీ కంఠస్వరంబుగా నున్నది. కాని పురుషునిది కాదు. పాప మా మందభాగ్యురా లెవరో పోయి చూచుట మేలు. (నడచుచున్నాఁడు)

చంద్ర—హా! కుమారా! నాకు నేఁటితో సర్వాశాపూర్తి యయ్యెనుగా తండ్రీ! నీదహనకార్యమునకుఁ దుదకుఁ గట్టెలకుఁ గూడ గతిమాలి నీతల్లి యల్లాడ వలసివచ్చెనే. (శవము నెత్తుకొని) హా! పుత్రా! నీకు నే నెంత ఘోరముఁ జేయ సాహసించితిని.

మ. చనుబాలిచ్చినతోడనే నిదురబు ♦ చ్చన్ బొత్తులందుంచి యు
ల్లన జోకొట్టుచు నొక్కకేలఁ, జెఱకే ♦ లన్ డోలికఁబట్టియూఁ
చిన నీతల్లియె యిప్పు డీచితిపయిన్ ♦ జేసేత నిన్ జేర్చి, హా!
యనిదుఃఖించెదు దిక్కుమాలి,కొడుకా!♦ యన్యాయమింకేమనన్

నాయనా! రాజాధిరాజ కుమారుఁడవైన నీకుఁ గాలవశమునఁ గష్టములు వచ్చినను జనిపోయిన వెనుకనైనను నీదహనవిధి యథావిధి జరుగక ఈ వల్లకాటియం దెవ్వనికో యొకని చితిలో సగము కాలిన యల్పకాష్ఠములు నీ కాధారము లయ్యెగదా! నవమాసములు మోసి, కని, ముద్దుముచ్చటలం బెంచిన నీకన్నతల్లియా నీకుఁ గడకుఁ దలకొఱవి నిడుట ఛీ! ఛీ! చంద్రమతీ! నీ వెంత రాకాసివి! ఈదుఃఖము నీపతికిం దాపియుక నీవొక్కతె నిట్లనుభవించుటకు నీజన్మ మెంత దౌర్భాగ్యపు జన్మము! (కొఱవి చితి నంటించుచున్నది)

హరి—(సమీపించి) ఓహో! నాయాజ్ఞలేకుండ నిక్కడఁ జితిఁ గూడఁ బేర్చినదే. ఓహో! ఎవ్వతె వీవు?

స్రగ్ధర

పడతీ! యేకాకివై ని ♦ ర్భయమున నిటకున్ ♦ వచ్చి నాయాజ్ఞ లేకీ
నడురేయిన్ వల్లకాటి ♦ న్నవదహనవిధి ♦ న్సలుపుచున్నావుగా! ఛీ!
చెడుగా చాల్చాలు పోపో ♦ చెడెదవు తగునే ♦ చేడె కీకృత్యముల్ నా
కడనా నీముచ్చువేసా ♦ ల్కడలు కదలుమా ♦ కాడు నీయబ్బసొమ్మా!

(అని చితిం గూలదన్నుచున్నాఁడు)

చంద్ర—అయ్యో ! ఇప్పుడు గూడ నెంత పరాభవము జరుగుచున్నది ? హా ! ప్రాణపతీ ! ఇట్టి యవస్థయందు నీవు సహాయపడుటకు నాయండ నుండవైతివే !

హరి—(స్వగతము) ఏమి ? పతివియోగమా ? ఎవతెయో కాని,

గీ. ఈనెలంత సుశీలగాఁ ♦ గానిపించుఁ
గారణాంతరమున నిట్టి ♦ కష్టదశను
జెందినట్లున్న దదికాక ♦ ముందు నేను
విన్నదియుగానె యున్నదీ ♦ వెలఁది స్వరము.

అయినను విచారించిన దప్పేమి ? (ప్రకాశముగా)

మ. పడతీ యెవ్వతెవీవు ? ఊలు గరఁగన్ ♦ వాపోవుచున్నావు, నీ
కొడు కెద్దాన గతించె ? నెవ్వఁడును నీ ♦ కుం జుట్టము ల్లేరె ? యీ
నడరే నొంటిగ నెట్లు వచ్చితి శ్మశా ♦ నక్షోణికిన్ ? చిత్ర మ
య్యెడు నీరీతి వచింపు, మేడ్చి ఫలమే ♦ మీ ? యూఱటం బొందుమీ.

చంద్ర—(స్వగతము)

గీ. అరయు నితఁ డొక మహనీయుఁ ♦ డట్లు దోఁచు
నీతని వచోవిధం బెన్న ♦ నేమొ కాని
పరిపరివిధంబులను బాఱు ♦ హృదయవృత్తి
యింత దుఃఖంబునను గొంత ♦ శాంతి వొడము.

ఏమైనను నిప్పుడు మౌనము వహించినఁ గార్యము నెఱవేఱదు. కాన నిట్లు మాట్లాడెదను.

చ. పురుషవరేణ్యా ! నీవెవఁడ ♦ వో యెఱుఁగన్, మసనంబులోపలన్
దిరిగెడు భూతనాథుఁడవొ ♦ దీనదశాకలనన్ గృశించు నన్
గరుణ ననుగ్రహించుటకుఁ ♦ గాఁ జనుదెంచిన సిద్ధమూర్తివో,
పరమదయాబ్ధి నే నపని ♦ గొఱగాని యభాగ్యదేవతన్.

హరి—మానినీ ! నే సిద్ధుండ గాను. భూతేశుండ గాను. ఈ వల్లకాటిం గావలి గాయువాఁడను. కాని సాహసముచేసి యీ యర్ధరాత్రమునఁ దోడులేక యిక్కాటి కెట్లు వచ్చితివి ? నీచరిత్ర మేమో యెఱిఁగింపుము. వచ్చిన కష్టము లనుభవింపక తీఱునుగదా !

చంద్ర-అనఘా! యెంత విన్నవింపఁగలన ♦ య్యా! రోళ్లఁ రోకళ్లఁ బా
డిన నా దీనచరిత్ర మెల్ల నొకపా ♦ శిన్ జేసి యీ దేహమొ
క్కని పొత్తోటఁ దలంచి ప్రాణముల బి ♦ గ్గం బట్టితే కాక యే
మనిజీవింతునుదిక్కుమాలి కడుహే ♦ యంబైన దాస్యంబునన్.

పూజ్యుఁడా! నీదీనురాలికినిప్పు డెవ్వరు తోడు రాఁగలరు? చూడు.

సీ. కొడుకా! యటంచు నా ♦ పడు నవస్థకు జాలి
గొని యేడ్చు నల దిశాం ♦ గన లె తోడు
తన జంట బాసి మిం ♦ టను "కూవు కువు" మంచు
శోకించు నల చక్ర ♦ వాకి తోడు
నను నూరడింప హో ♦ రని యేడ్చు లోకపా
వనియగు గంగాభ ♦ వాని తోడు
ననుఁ జూచి బొటబొట ♦ మను మంచుకన్నీళ్ళు
లం గార్చు దేవె యి ♦ ల్లాంద్రుడు తోడు
ఆపదలకైన వారి నా ♦ యన్నవారి
దిక్కులేనట్టి నావంటి ♦ దీనసతికి
కాశికావిశ్వనాథుఁడే ♦ కలఁడు తోడు
కడమతోఁ జేడ నాకు నో ♦ కాటితేఁడ!

మహానుభావుఁడా! నీవు నాకుఁ గడు పూజ్యుఁడవుగాఁ దోడు వచ్చుచున్నాఁడవు.
నేనీకాశీపురంబున నొక బ్రాహ్మణునియింట దాసిని. నా పేరం సనారి యం
దురు. ఈచనిపోయినవాఁడు మదీయ పుత్త్రుండు. వీని నేఁటిసాయంసమయమున

చ. అడవికిఁ బోయి గట్టెలఁ గు ♦ శాదుల దెమ్మను తేనియాన ని
య్యెడ కడు దేర నాదు దుర ♦ దృష్టము చేతఁ బెనుబాము చేతి నీ
కొడుకున కీ నవాంగజున ♦ కున్ మరణము ఘటిల్లెనయ్యా, నా
పడు దురవస్థ యేమనుచుఁ ♦ బల్కెడు దుఃఖముపొంగిపొర్లెడున్.

హరి—(స్వగతము) ఏమిది ఈమానినిం జూచినప్పటినుండియు నాహృదయము కార
ణముగా దుఃఖసంకులం బగుటయు గాక విశేషించి,

ఉ. ఈయలివేణి నోట వచి ♦ యించెడు నొక్కొక మాట రొక్క వ
జ్రాయుధమై పెకల్చెడు శి ♦ లాకృతి గాంచిన నాదు మానసం

బీయమ మాటపొందికయు ♦ నెల్లు దెఱంగు నుదంత మెల్ల ని
స్సీ యనరాదుగాని స్పృహి ♦ యించును చంద్రమతీ సతీమణిన్.

అదిగాక యిక్కాంత కష్టావంతిం జెల్ల మందభాగ్యుండ నైన నాకే తగిలివచ్చుచున్నది. చనిపోయిన యీకుఱ్ఱఁడు మాలోహితుండు కాఁడుగదా! ఛీ! ఛీ! నాపాడు, తలంపున కెట్టి దురూహ పొడమినది! కొడుకా! లోహితా! నీకమంగళము ప్రతిహతమగుగాక! ఇఁక నా వెడఁగుదలంపుల మానివేసి నావిధియందు సావధానచిత్తుండనై మెలంగెద. (ప్రకాశముగా) ఓ మానినీ! నీవెవ్వతెవైన మాకేమిగాని, నాయాజ్ఞ లేకుండ నిక్కాటి కీశవమేల కొని వచ్చితివి? ముందుఁ జెప్పుము.

చంద్ర—పూజ్యుఁడా! శవదహనమునకుఁ గూడ నొకరి యాజ్ఞ కావలయునా?

హరి—ఏమిగా! బొత్తుగా నిచ్చటి కాటిచట్టముల నెఱుంగకున్నావే! ఎవ్వరుగాని దహింపవలసిన శవమును దెచ్చి ముందు మాకుఁ జూపి, చెల్లింపవలసిన సుంకమును జెల్లించినగాని దహనకార్యం బుపక్రమింపరు. నీవు బలు తెగువదానివిలాగున్నావు గాని

చ. పదపద యిప్పుడైన తెఱ ♦ వా! తడవయ్యెను మాపు, నేల ని
ల్పెద వికఁ? నిక్కుగాగ నిక ♦ ళేబర మావల. జాఱవైచు నం
తదనుకఁబోవె? శూలినయి ♦ నన్ దలగోయక యూరకుందునా
ముదితవుగాన నే బ్రతికి ♦ పోయితి వింక దొలంగు మిచ్చటన్.

చంద్ర—ఓ దయామయా! యెఱుంగకఁ జేసిన నా నేరమును మన్నింపుము. నేనిప్పుడు శరీరమాత్రవిభవనై యున్నాను. నిప్పునింట నూడిగము చేసికొనినగాని గ్రాసవాసంబులు జరుగని నిరుపేదరాలను; నే నేమూలముగఁ గాటిసుంకమును జెల్లింపఁగలను?

హరి—(స్వగతము) అకటా! నే నెంత గాఠిన్యము వహింపవలసివచ్చెను. (ప్రకాశముగా) మానినీ! నీవు పేదరాలవైన మాకేమి? భాగ్యవంతురాలవైన మాకేమి? భాగ్యమున్నను రావలసిన సుంకముకంటె నెక్కుడు మే మపేక్షింపము. మాడ యొకటియు, పిండంబుఁ దండులంబులును, నొక పాతయు, మా కిచ్చినంగాని నే నీశవమును దహింపనీయను. నన్నుఁ గఠినాత్ముం డని యెంచినను సరే కులధర్మంబు మీటింబుచ్చి యీరీతిం గాటికాపరితనముచే జీవించు నీ చండాలదాసునకుం గరుణ యెక్కడిది? పొమ్ము.

చంద్ర—అయ్యో! ఎవరైననేమి? దీనరక్షణము తప్పు గాదుగదా!

హరి—తప్పో యొప్పో మాకడం జెప్పకుము. పొమ్ము. శవమును బాఱవైచెదఁ జూడుము. (అని పాఱవైవఁబోవును)

చంద్ర—అకటకటా! ఎంతటి కానికాలము సంభవించినది. విశ్వవిఖ్యాత[illegible] బున నెల్ల నేకచ్ఛత్రాధిపత్యము వహించి యక్రాంతంబు [illegible]

సామంతభూకాంతులకోటీమణిఘృణీరావంబులచే విరాజిల్లు పాదయుగళము గల చక్రవర్తికిఁ గుమారుఁడై కడకీకాటిలోఁ జేరెదు నేలకేని స్వతంత్రుఁ డగుటకు నోఁచుకొనక పోయెనుగా ? కొడుకా ! నీ ప్రారబ్ధంబున కెంతని విలపింతు ?

హరి—(స్వగతము) ఈబాలుం డెవ్వఁడో మహారాజు కుమారుండని విస్పష్టమైనదే నేనింక నేమని తలంతును ? వీఁడు నిశ్చయముగా మాలోహితాస్యుఁ డేమో? నిస్సంశయముగాఁ బేరు తెలియకయే నే నేల కీడు నే యూహింపవలయును? తండ్రీ ! లోహితాస్యా ! నీకు దీర్ఘాయురారోగ్యములుఁ గలుగుఁగాక ! వీఁ డెవ్వఁడైన నేమి ? నావిధియందు నే నొకవిధముగాఁ బ్రవర్తింపరాదుగదా ! (ప్రకాశముగా) ఓకాంతా ! నీ వెంత యేడ్చినను నేను గరుణింపఁజాలను. నీయుదంతం బంతయు గడునద్భుతముగా యున్నది. చనిపోయినవీఁడు రాజకుమారుఁడైనట్లు నీయేడుపువలనఁ దెలియవచ్చినది. నిజముగా నీవు రాచదేవేరివే యైనచో మా కీయవలసిన కాటిసుంకము నీకడ లేకుండునా ?

చంద్ర—అయ్యో ! కాలవైపరీత్యమున నుత్తమపదవిం బాసి యిప్పుడు నేను శరీరమాత్రవిభవనైయున్నానని ఇదివఱకే విన్నవించుకొంటి నే. నీకేలదయరాదు.

హరి—నేనిది బొత్తుగా నమ్మను. నీకిప్పుడున్న విభవము శరీరమాత్రమే కాదు. ఆలోచించుకొనుము.

చంద్ర—అయ్యో ! ఇంకేమున్నది ?

హరి—ఏమీ ! ఇంకేమి లేదా ? చూడు.

మ. దళమౌ పయ్యెదలో నడంగియు సము ♦ ద్యత్కాంతు లీరెండలన్
మలయింపన్ దిశలన్, ద్వదీయగళ నీ ♦ మన్ బాలసూర్యప్రభా
కలితంబై వెలుఁగొందుచున్నదది మాం ♦ ల్యంబు కాఁబోలు ! నే
వెలకైనన్ దెగనమ్మి నీసుతునకై ♦ వెచ్చించినన్ జెల్లదే ?

చంద్ర.—(ఉలికిపడి) అయ్యో ! దైవమా ! రెండవ సురజ్యేష్ఠుఁడగు వసిష్ఠమహర్షి ప్రభావంబుచే నాపతికిఁ దక్క నన్యులకు గోచరంబుగాని నా మంగళసూత్రం బొక్కచండాలుని కంటంబడెఁగా! కాదుకాదితఁడు నాపతి హరిశ్చంద్రుఁడే (అని కాఁగిలించుకొని) హా ! జీవితేశ్వరా ! హా ! విశ్వంభరాఖండరాజ్యప్రదానసంతర్పితకౌశికా ! హా ! వసిష్ఠప్రియశిష్యా ! హా ! సార్వభౌమలలామా ! హా ! సత్యప్రియా ! హా ! హరిశ్చంద్రా ! నే నేమందభాగ్యురాలనగు నీజీవితేశ్వరిని, చంద్రమతి, ఎల్లప్పు డల్లారుముద్దుగాఁ బెంచిన నీ వంశాంకురంబగు నీ కుమారుఁడు లోహితాస్యుఁ డీ కాటిలో గులకరాలపై నెట్లు పండుకొనియున్నాఁడో యొక్కమాఱుఁ గన్నెత్తి చూడుము. ప్రాణపతీ ! రాజరాజకోటీరమణిమంజరిదీప్త పాదాంభోజుఁడగు నీకా, ఈకాటికాపరితనము. అకటకటా ! దురవలోకనంబగు నీప్రేతాలయంబే నీ కయో

ధ్యాపురం బయ్యెనే ? కఱకుఁగలిగిన సులకఱ్ఱాళ్ళచే నల్లబడిన యీమంచె యే నీకు నవరత్నసింహాసనం బయ్యెనా ? భయంకరంబులగు నీభూతభేతాళ పిశాచగణంబులా నీకు భటసముదాయము ? శవనికరంబుల దహించుచుండిన సొదగుంపా ! నీకుఁ గరదీపికా సహస్రములు ? నాథా ! నీరాజసం బెందు పోయినది ? నీతేజం బెందు డాఁగినది ? జీవితేశ్వరా ! అశ్రాంతంబు పాదాక్రాంతులై నమస్కరించు సామంతులెల్ల నీ కిప్పు డేల యడుగునకు మడుఁగు లొత్తకుండిరి ? కరపల్లవంబుల బంగారు పళ్ళెరంబులఁ బట్టి పురంధ్రీజనంబు నీకేల నీరాజనంబుల నెత్తకుండె ! నీసత్యభాషామనీషం గుఱించి ప్రబంధముల నుడువు వందిమాగధజనం బెందుఁబోయె ? రాజచూడామణీ !

సీ. పసిడిమేడలలోన ♦ వసియించు ప్రభునకా
కటకటా ! యీ వల్ల ♦ కాటి వసతి ?
కనుసన్న దొరలచేఁ ♦ బనులందితో మీకు
యీ నికృష్టపుమాల ♦ వాని సేవ
అలరుఁదేనియలతో ♦ నారగించెడు మీకు
అకట ! శవాల పిం ♦ డాశనంబు
జిలుగు బంగారుపు ♦ స్తుల ధరించెడు మీకు
పొలసుక పొలయు నీ ♦ బొంతకోక
కనుల మీ యిట్టిదుస్థితిం ♦ గనిన నాకుఁ
జావురాకున్న దెంతని ♦ సంతసింతు
హా ! హరిశ్చంద్ర ! సార్వ వి ♦ ద్యాఫణీంద్ర ?
బుధజనమనశ్చకోర సం ♦ పూర్ణచంద్ర !

ప్రాణేశ్వరా ! మన విపత్పరంపర కేనాటి కంతములేకపోయెనే ? నన్ను విక్రయించుటచే విశ్వామిత్రుని ఋణబాధ నిరవశేషముగాఁ దొలంగి యెక్కడనో మీరు కొంత సుఖముగా నున్నారని తలంచితిఁ గాని నాకు సంభవించిన దాస్యమునకంటె వేయిమడుంగు లెక్కుడు నీచంబగు నీచండాలసేవావృత్తి యందుఁ జిక్కియున్న మీకడకుఁ జనిపోయిన లోహితాస్యునికళేబరముతో నిట్లు వచ్చెదనని యెక్కనాఁడు దలంపనైతినే? నృపసార్వభౌమా ! ధైర్యము వహించి యెక్కమాటైన నాడుము.

హరి—ఏమీ ! నీవు చంద్రమతివా ? అయ్యో ! వీఁడు నాకొడుకు లోహితాస్యుఁడా ! (కుమారు నెత్తుకొని)

శా. హా ! సూర్యాన్వయవార్ధి కౌస్తుభమణీ ! ♦ హా ! సద్గుణాంభోనిధీ !
హా ! సౌందర్యనిరస్త మన్మథశతా ! ♦ హా ! పూర్ణచంద్రాననా !

హా! సల్లక్షణ లక్షితాంగ లలితా! ♦ హా! మత్తభృంగాలకా!
హా! సేవాపరితోషితద్విజమణీ! ♦ హా! లోహితా! హా! సుతా!

తండ్రీ! పలుకవేమి? నిన్ను దుస్సహంబగు సేవకావృత్తి నప్పగించిన కిరాతుండైన నిన్ను గన్నతండ్రిని నన్నొక్కమాఱు ఱెప్పలెత్తి జూడుము. నాయనా! నీ వప్పుడే స్వర్గయాత్రం బట్టుటకు నీకేమి కూఱేండ్లు పట్టినవి? కొడుకా! లోహితా!

సీ. మోయలే దింకను ♦ మూఁపు కాయలు గాయ
సర్వసర్వంసహా! చక్రతలము
వ్రాయలే దింక గ ♦ ర్వాయత్తుల జయించి
యఖిల దిక్కుల విజ ♦ యాక్షరముల
నిలుపలే దింక స ♦ త్కులకాంతను వరించి
సింహాసనము నీ ♦ చిన్నిసుతుని
నలుపలే దింక ని ♦ ర్జరకోటి మెచ్చఁగా
నశ్వమేధాది య ♦ జ్ఞాదికముల
కన్నతల్లిదండ్రులగు మాకు ♦ నిన్ని నీళ్ళు
విడువవలసిన పనిఁగూడ ♦ నడుపలేదె
యిన్నిపను లున్నవే నీకు ♦ మన్నె ఱేఁడ!
యెందు కీజాడ? లేచి రా ♦ యందగాఁడ?

చంద్ర—జీవితేశ్వరా! ఇఁక నెక్కడి కొడుకు! మీరు ప్రాకృతునివలె శోకాంధకారంబున మునుఁగఁ దగదు. ముందు జరుగఁదగిన కుమారుని దహనవిధి కుపాయమేదైన నున్నచోఁ బరికింపుఁడు. ప్రొద్దుపొడవకమున్నపోయి కంటి కగపడకున్న మాదొరసాని కాలకంటకి యాజ్ఞ నుల్లంఘించినదాన నగుదును.

హరి—దేవీ! నిర్భాగ్యుఁడనై చండాలదాస్యంబునఁ బొట్టపోసికొను నేను నీకే యుపాయమున సహాయము చేయఁగలను? చెప్పుము.

ఉ. అందఱి కెట్టివో స్వవిష ♦ యంబున కట్టివె కాటిచట్టముల్
నందనుఁడంచు వీని గరు ♦ ణం గని వేఁలినవాని యాన మీ
ఱం దగవా సతీ! కనిక ♦ రమ్మున కింత యెడమ్మ లేదు, మా
డం దొరకీక యిప్పుడిచ ♦ టన్ జితిఁ బేర్చుట కేను గర్తనే?

కావున నెట్లయిన మీదొరసాని నడిగి మాస్వామి కీయవలసిన మాడయుం బాతయు సంపాదించుకొని రమ్ము. ఇప్పుడు నాచేతనైన సహాయము నాకిందు రావలసిన పిండాశనము మానుకొనుట దక్క వేఱొండు లేదు.

చంద్ర—హా! విధీ! యెంతవాని కెంతటి దురవస్థఁ దెచ్చిపెట్టితివి? హా నాథా! ఇట్టి

యిక్కట్టులందును మీరు ధర్మపథంబు దొలంగనందులకు నాకు సంతసమే కలుగుచున్నది. నేను మాదొరసానికడకేగి మాడయుఁ బాతయు నడిగెదను. ఆబిడకా కాసంత దయగూడ కలుగకున్న విధి యెట్లువిధించెనో యట్లగుగాక!

హరి.—శీఘ్రముగఁ బొమ్ము. అంతదనుకఁ గుజ్జువానికళేబరము నేఁ జూచుచుండెద.

(చంద్రమతి నిష్క్రమించును)

హరి—(కుమారుని ముందుంచుకొని) హా! హా! యెంత ఘోరము సంభవించినది? కొడుకా! లోహితా!

మ. చతురంభోధి వరీత భూతధరణీ ♦ సామ్రాజ్య సర్వస్వ సం
తత ధౌరేయుఁడనయ్యు నీవొకనియిం ♦ టం గూటికై బంటవై
యతినైచ్యంబు వహించి దిక్కు సెడి ♦ యిట్లైనాఁడ వేమందు నీ
బ్రతుకీనాఁటికె తెల్లవారెఁగద పు ♦ త్రా! యిన్నిబన్నాలతోన్

తండ్రీ! నీ ప్రాణము నకా కాలసర్ప మెక్కడ దాపురించెను? నిన్ను గన్నతల్లి దండ్రు లెన్నో దుఃఖంబు లనుభవింప రాళ్ళవలె బ్రతికియుండ నీవు దిక్కులేక యేకాకివై తుదకిట్లు దుర్మరణంబు పాలైతివే?

శా. నిన్నాపన్నగముగ్రతం గఱవఁ దం ♦ డ్రిం దల్లివిన్ జీరి యే
మన్నావో యపు డెంత బాధపడితో ♦ హా! పుత్రకా! నాకునై
యెన్నోబన్నము లందినావు తుదకి ♦ ట్లేకాకివై పోవ నే
గన్నారం గనవైతి నీయెడఁ గృత ♦ ఘ్నత్వంబు వాటించితిన్.

ఇంక దుఃఖించి యేమి ప్రయోజనము? నీవు దీర్ఘాయుష్మంతుఁడ వగుదువని నుడివిన కాలజ్ఞులపల్కులే నిక్కంబులగునేని నీకిన్ని కష్టంబులు రాకుండు. కాటిపన్ను నకై పోయినదేది ఇంకను రాకున్నదే? తెల్లవారినదే? ఏమీ కలకలము?

(తెరలోఁ గలకలము, ఓహో పురజనులారా! మన రాజుగారియింట దొంగతనము చేసి ధనాశచే రాచబిడ్డం జంపిన యీ శిశుహంత్రినిఁ దలఁగోయవలసినదిగా రాజాజ్ఞయైనది కనుక దీనిని వధ్యశిలయొద్దకుఁ దీసికొనిపోవుచున్నాము.

హరి—(ఆకర్ణించి) రాజభటు లిక్కడికే వచ్చుచున్నారే.

భటు—(ప్రవేశించి) ఓయీ! వీరదాస! రాజు నాన మేర బాలహంత్రినిఁ దల నఱుక మావీరబాహు నీకుత్తర మిచ్చినాఁడు. ఇదిగో నాతని యానవాలు. దీని నింకఁ దల నఱుకుము.

హరి—(స్వగతము) ఏమిది! నాకన్నుల కేమైన భ్రమ కల్గెనా? నిక్కముగా నే చంద్రమతిని జూచుచున్నానా? ఈ శిశుహంత్రి చంద్రమతియా? (ప్రకాశముగా) అయ్యలారా! మీరు నేరస్థాపనయందుఁ బొరపాటు పడఁదగదు. తిన్నగ నాలోచింపుఁడు,

భటు—ఏమోయీ ! మహారాజుగారియాజ్ఞకే యెదురుచెప్పుచున్నావు ? నీకీ యధిక ప్రసంగ మెందులకు ? వెంటనే రాజాజ్ఞ నిర్వర్తింపుము. మేమిఁకఁ బోవుచున్నాము. (నిష్క్రమింతురు)

హరి—(చంద్రమతిని సమీపించి దుఃఖముతో)

శా. హా ! కాంతా ! జగదేకపావనివి యీ ♦ యన్యాయ్యపున్నింద నీ
కాకల్పించుట? రాజునిర్దయుఁడె? యో♦గ్యాయోగ్యము లూన్పఁడే?
లోకం బంతయు నస్తమించెనె? దయా ♦ ఖండైన దేవుండు లేఁ
డే కాపాడఁగఁ? గర్మసాక్షి పయి లేఁ ♦ డే? సర్వముం జూడఁడే.

చంద్ర—నాథా ! దుఃఖింపకుఁడు. దైవము లేకేమి ? నా పూర్వజన్మసంచిత పాపఫలంబున నిజమో, యబద్ధమో కాశికాపురాధీశ్వరునిచే శాశ్వతమైన ఈలాటి నింద యారోపింపఁబడి స్వచ్ఛమైన నీకులంబునకెల్ల నొక కళంకంబు దెచ్చిన పాపాత్మురాలనైతి.

హరి—ఏమీ ! జగదేకపావనియగు నీయందే యొక నీచుఁడు నిందారోపణ మొనరించెగా ? ఎట్లు ?

చంద్ర—నాథా ! అవధరింపుము. అట్లు మీచే సెలవందికొని పోవుచుండ దారిలో నొక మాలశవము నాకాలికిఁ దగిలెను. అంత మతిచలించిన దానైన యా కళేబరము మన లోహితునిదేమో యని పరికింపుచుండ యమకింకరులం బోలిన రాజభటు లచ్చోటికి వచ్చి "ఓసీ పాపాత్మురాలా, రాచబిడ్డ నేల చంపితివి" యని నగలమూట నొకదానిని నాయొడింబడవైచి దొంగ చిక్కెనని నన్నుఁ దన్నుచు రాజసాన్నిధ్యంబునకుం గొంపోవ నతం డతికుపితమనస్కుండై నాతల నఱుకుమని యాజ్ఞాపించె. ఇదియే నానిందకుఁ గారణము

హరి—అకటకటా ! ధర్మమునకు నేఁటికెంతటి దుస్థితి సంభవించినది. తనచిత్తంబు మెప్పింపవలయునని సేవకులెవ్వరిపైననో నేరమారోపించి తనయొుగటనిల్చిన తోడనే న్యాయాన్యాయములు విచారింపకుండ నిరపరాధులఁ గూడ సాపరాధులఁ జేసి శిక్షించుచుండిన యీలాటి రాజు లుండియేమి ? మండియేమి ? దేవీ ! చంద్రమతీ ! నేఁటితో మనయాశాబంధముఁ గూడ దీరిపోయినది. నేనింక నా స్వామియాజ్ఞ నెఱవేర్పక తప్పదుకదా ! ఇదిగో ! ఖండితులైన అపరాధుల రక్తపంకముచే నెఱ్ఱనై యున్న యీ వధ్యశిల నీ వింక నారోహింపుము. కులకాంతను విన్నొకనికి విక్రయించిన యీ కృతఘ్నునకు స్త్రీహత్యాపాతకము గూడ రాదగ్గదే.

చంద్ర—(వధ్యశిల నారోహించి) నాథా ! మీరింక నాకై చింతింపకుఁడు. మీ రెఱుగని ధర్మములు లేవుగదా. నన్నుఁ జంపుటవలన సంభవింపగల పాపము నిరపరాధుల శిక్షించు నీగాశికాపురాధీశ్వరుఁ జెందుగాని, మిమ్ముంట నేరదు

అరిగాక రాచబిడ్డను జంపితినను నీచమైన నిందను మోసిన నే నింక బ్రతికి పాత్రమేమి ప్రయోజనము ? ఎక్కడనో నీచవుచావు చావకుండ నాజీవితేశ్వరులగు మీచేత నేఁ జావఁగలిగినందులకు నేను బూజ్యురాలనే! మీరింక నిశ్శంకచిత్తమున మీసత్యనిరూఢి వెల్లువెల్లం బ్రకాశింప నాతలంద్రుంచి మీ స్వామియాజ్ఞ నెఱవేర్పుఁడు. ప్రాణపతీ! నాకడసారి వందనమందికొనుడు.

హరి—హా! హా! దుర్భరము దుర్భరము. దేవీ! నీ వెంత చెప్పినను నా కూఱట జనించు టెట్లు ?

సీ. నీవేకదా నాకు నిఖి ♦ లేప్సితంబులఁ
గరగతంబు లొనర్చు ♦ కల్పలతవు
నీవేకదా నాకు ♦ నిత్యసత్యయశంబు
దరిఁజేర్చుచుండెడు ♦ ధైర్యలక్ష్మి
నీవేకదా ఘోర ♦ దావానలమునుండి
మమ్ము రక్షించిన ♦ మానవతివి
ఈవేకదా మౌని ♦ ఋణబాధఁ దొలఁగించి
పరువు నిల్పినయట్టి ♦ భవ్యమతివి
గీ. నీవెకా నావిధానంబ ♦ వీవె కావె
నాకులవిభూషణంబవు ♦ నలిననయన
అకట నే నాకు వేయి జ ♦ న్మములకైన
నిన్నువంటి సతీమణి ♦ నెలఁతమిన్న !

చంద్ర—నాథా! దుఃఖం బుపశమింపుఁడు.

హరి—ఇదిగో! నేను దుఃఖము విడిచిపెట్టినాఁడను.

గీ. మానినీమణి! గతమెల్ల మఱచిపొమ్ము
బదులపఱుపు మేకాగ్రత ♦ హృదయవృత్తి
భక్తిఁ గడసారి నాభగ ♦ వంతుఁ గూర్చి
నేత్రయుగ్మంబు మోడ్చి ధ్యా ♦ నించుకొమ్ము.

చంద్ర—పరమేశ్వరా! దీనబంధూ! దయాగుణనాథా! విశ్వనాథా!

మ. ఇదియే నాకడసారి ప్రార్థనము తం ♦ డ్రీ! సర్వభూతేశ! నే
నసి మోక్షపదంబు గోర నిఁక నె ♦ న్నేజన్మముల్ నాకు నీ
వొసఁగం జేయుదు నన్ని జన్మముల కె ♦ ట్లో నిత్యసత్యవ్రతున్
సుసత్యాగ్ర్య విచారధీయుని హరి ♦ శ్చంద్రుం బతిం జేయుమీ

ప్రాణేశ్వరా ! నే నీ జన్మమున నీ కొనరించు కడపటి నమస్కార మిదియే ఇంక రాజాజ్ఞ నిర్వర్తింపుఁడా.

హరి.—ఆహా ! నా నాటకంబునకు నిర్వహణసంధి నా భార్యావధవిధానంబుతో ముగియుచున్నదిగదా ? అయ్యో ! నేనెంత ఘోరపాతకుఁడను ! పాలవంటి కులం బెల్ల నా కులం బొనరించి యొక్క చండాలుని దాస్యం బంగీకరించినది చాలక శరణాగతులగు వారిపైనను స్త్రీజనంబుపైనను గృపాణ మెత్తక రక్షింతు నను నా ప్రతినఁ గూడ భంగము గావింపఁ జేసెట్టిన కులకాంతను, నిరుపమాన పతివ్రతాలలామను జేతులారఁ దలఁగోయ సాహసించుచున్నాను. అయ్యో ! స్వామియగు వీరబాహు నన్నీ యీ కార్యంబున కేల నియమింపవలయు ? తానే రాజాజ్ఞ నిర్వర్తించిన నాకింత సంతాపము లేకుండుఁగదా! దైవమా ! ఇన్ని దుఃఖములతో నన్నితకాలము బ్రతుకనిచ్చిన దిట్టి స్త్రీహత్యాపాతక మొడిగట్టుటకా ? కటకటా ! భూదేవీ ! స్త్రీహత్యకుఁ గూడ బాల్పడిన యీచండాలుని ప్రాణంబులఁ బోకార్చి నీభారము కొంత తగ్గించుకొనరాదా ? భగవానుఁడా ! లోకబాంధవా ! నీ వంశ మెల్ల నిట్లపకీర్తిపాలుచేయుచున్న యీ నీచ హరిశ్చంద్రుని నీ సహస్ర కిరణములచే భస్మీభూతునిఁ జేయలేవా ? మునిజనగరిష్ఠా ! వసిష్ఠా ! ఈ నీశిష్యుని పాపకర్మంబులఁ గన్నారఁ జూచుచుండియుఁ బ్రళయకాల నిర్ఘాతసమయమైన నీ శాపవాక్కు విడువకున్నావేమి ? ఛీ ! ఛీ ! దక్షిణహస్తమా ! నీవు దినక్రమమున నీసుకృతము లన్నియు మంటఁగల్పికొని తుదకేమి కానున్నావు ?

ఉ. కమ్మనియాలనేత మును ♦ గన్ సవనాగ్నిని దృప్తిసేయు పు
ణ్యమ్ము సగమ్మణంగె మన ♦ నమ్ముచుఁ బిన్నఁగులంటుటన్, వివా
హమ్మున నేసతిన్ విడువ ♦ నంచు స్పృశించితొ తచ్ఛిరమ్ము నా
కొమ్మను జంపగా సగము ♦ గూడ నశింపదె పాపహస్తమా !

ఖడ్గమా ! నీ వెంత యపకృతికిఁ బాల్పడుచుంటివి ?

చ. విడచితి రాజ్యమైన, సర ♦ వింగులకాంతను నైనఁ గన్న యీ
కొడుకునునైన ! నిన్ను ఘను ♦ గుంగ గాఁ జూచితింగాని ఖడ్గమా !
కడ కిటు నల్లనా [illegible] ♦ [illegible]
విడువనె, [illegible] ?

ఛీ ! ఏమి, నామతిచాంచల్యము ? పవిత్రమైన సత్యవ్రతమును [illegible] ఇంత సాహసమైన నాచరింపవలసినదే కావున,

సీ. హృదయమా ! సతికి నా ♦ ఋణము చెల్ల నటపోయె
నీకేట [illegible] యీ ♦ నెలతపైన

మోహమా! నీకాల ♦ ము గతించె మాచెంత
బ్రతుకు మెందేని దం ♦ పతులపొంత
దుఃఖమా! నీవుగ న్న ♦ దోసఁగు తప్పదు మాకుఁ
దొలఁగి పొమ్మింక నా ♦ తలఁపు వీడి
ఖడ్గమా! మాఁగనీ ♦ క ఠరక్తము గూడఁ
జవి చూడఁగలవు ని ♦ శ్చలతఁ గొనుము

గీ. సత్యమునకయి యీ హరి ♦ శ్చంద్రు వంశ
మంతరించెడుగాక (శ్రీ) ♦ హరునిమీఁద
మనసు గుఱిఁజేసి హా! చంద్ర ♦ మతి త్వదీయ
కంఠ మర్పింపు నీపతి ♦ ఖడ్గమునకు.

[అని కత్తి నెత్తఁగా హఠాత్తుగా విశ్వామిత్రుఁడు ప్రవేశించి నివారించి]

భళి! భళిరే! హరిశ్చంద్రా! చాలు! చాలు! నీసాహసకర్మంబు! ఛీ! ఛీ! నీ వెక్కడనో రాకాసికి జన్మింపవలసినవాఁడవు. నీముఖము జూచిన దురితము, విపక్షశిక్షాదక్షంబగు నీకాక్షేయము నేఁటి కీలాటి లతాతన్వుల జంపసిద్ధపడెఁగా? "ఆఱు నెలలు సాముచేసి మూలనున్న ముసలమ్మ నోడించి"నట్లు నీభుజబలం బీలాగున గుసుమకోమలులం జంపుటకు నక్కఱకు వచ్చెనుగా? నీకులగురుండగు వసిష్ఠుఁడు నీకు ధనుర్వేదము నేర్పిన దిందుకేనా? జగద్వంద్యమగు సూర్యవంశంబునం బుట్టి మావంటివారికెల్ల దలవంపులగునట్లొక్క చండాలుని దాస్యంబునకుఁ జొచ్చుట చాలక స్త్రీహత్యకుం గూడఁ బాల్పడితివిగా? దుర్మార్గుఁడా! సముచితసాధ్వీమతల్లియగు నీ యిల్లాలిం జంప నీ వింక నేస్వర్గరాజ్య మేలఁదలంచితివి? ఇప్పటికైన నామాట విని సౌందర్యశీలలగు నా ముద్దుకూఁతులం బరిణయ మగుము. నీదారపుత్రుల ప్రాణదానంబును, రాజ్యప్రదానంబును ననుగ్రహించెద వినుము. నావాక్యము అమృతోపసమానములు సుమీ!

హరి—(నవ్వి) గాధేయా! ఈనీతులు నా కవసరములేదు గాని మీరింక నిక్కడ తొలఁగిపొండు. నాపూనిక మాన్ప నింక మీతరముకాదు. పొండు పొండు.

విశ్వా—కాని నీ వనుభవించెదవు. (స్వగతము) నే నిప్పు డేమి సేయుదును?

హరి—దేవీ! సిద్ధముగా నుండుము.

విశ్వా—(తత్తరముతో) హరిశ్చంద్రా! ఈపాటికి శాంతింపుము. నీ గురువే జయించెను. నేనే యోడితి.

హరి—అయ్యా! మీమాటలు నాకర్థముకావు. గురువేమో జయమేమో నే నెఱుగను. పొండావలకు.

విశ్వా—(దిక్కులకుఁ బరుగెత్తుచు) నక్షత్రకా! నే నిప్పు డేమి సేయుదునురా?
ఓదేవేంద్రా! మీ రైన హరిశ్చంద్రుని వారింపుఁడు. హరిశ్చంద్రా! శాంతింపుము.

శా. సత్యశ్రీసిధివైతి, నీగురుప్రతి ♦ జ్ఞావాక్యము ల్సెల్లె; స్త్రీ
హత్యాదోషముఁ గట్టకొకు మిపు ♦ డార్యాభర్త విశ్వేశుఁడే
ప్రత్యక్షం బగు నీదు దేశికునితోఁ ♦ బాలింపుమా నన్నుఁ, బ్రా
ణత్యాగం బొనరింతు లేనియెడ న ♦ న్యాయంబుగా నీకునై.

[మరల దిక్కులకుఁ బరుగెత్తుచు]

శా. నేరంబుల్ దిగమ్రింగి కాళ్ళబడినన్ ♦ వేధింతువేమీ వసి
ష్ఠా! రాయిప్పుడు పెండ్లివారినిడక ♦ ల్సాగింపకయ్యా! మహేం
ద్రా! రాజిప్పటికే తెగించి తన కా ♦ ర్యం బెల్ల నెగ్గించె నే
మోరా రండిక? జమ్మదాక బిగియిం ♦ పుల్గూడ వెవ్వారికిన్.

ఓ కాశీ విశ్వనాథా! నీవైన నీ రాజేంద్రుని వారింపుము.

[పార్వతీసహితుఁడై పరమేశ్వరుఁ డింద్రవసిష్ఠులతోఁ బ్రవేశించును]

పర-శా. శాంతింపొందు త్రిశంకునందన! హరి ♦ శ్చంద్రా! భవత్సత్య వి
క్రాంతిన్ మెచ్చితివచ్చితిన్ వరములన్ ♦ గై సేయు, నీసద్యశ
స్సంతానంబులు వియ్యమంది సకలా ♦ శాదంతి దంతప్రభా
సంతానంబులతో నిరంతరము వి ♦ శ్వస్తవ్యమై క్రాలెడిన్.

హరి—(ప్రాంజలియై) మానినీవృత్తము.

జయ జయ సురరంగా! సంగతసోత్తమాంగా!
జయ శరధినిషంగా! శైలజాభిషంగా!
జయ వృషభతురంగా! సాధుచిత్తాబ్జభృంగా!
జయ జయ ధవళాంగా! సంతతానందసంగా!

మహాత్మా! గిరీశా! నమస్కారము. మహేంద్రా! వందనము. గురూత్తమా! అభివాదము.

వసి—వత్సా! హరిశ్చంద్రా! నీయెడ పరమేశ్వరుఁడు ప్రసన్నుఁ డయ్యె. నీకింకఁ గష్టములు తొలఁగినవి.

పార్వ—చంద్రమతీ! పతివ్రతాతిలకం బగు నీచే లోకం బంతయుఁ బవిత్రమైనది. నీకేమి వరములు కావలయునో కోరుకొనుము.

చంద్ర—అమ్మా! మీరు ప్రసన్నతం జెందిన నీయరాని దేమున్నది? చనిపోయిన రాచబిడ్డం బ్రతికించి నా యపవాదంబుఁ బాంపుము.

పార్వ—సాధ్వీమణీ ! నీధర్మగుణంబునకు మెచ్చితి. రాచబిడ్డతోఁ గూడ నీ కుమారుఁడును సజీవుం డగుగాక ! లోహితాస్యా ! లేచిరమ్ము. (లేవనెత్తును)

[తల్లిదండ్రులు కౌఁగిలించుకొందురు]

లోహి—మిత్రులారా ! నేఁ గోసిన కుశ లెక్కడ ?

పర—వత్సా ! నీగురువునకుఁ జేరినవి. తొందరపడకుము. హరిశ్చంద్రా ! నీ వింక నీరాజధానికిఁ బోయి పట్టభద్రుఁడ వగుము.

హరి—అయ్యో ! చండాలదాసుఁడనైన నాకింక రాజ్య మెందులకు ? మీ దర్శన భాగ్యము లభించెఁ జాలదే ?

విశ్వా—హరిశ్చంద్రా ! సత్యవ్రతముఁ బరీక్షింప నేనే నీ కిన్ని కష్టంబులం దెచ్చి పెట్టితిని. ఇది యంతయు నామాయాకల్పితము. చూడుము.

గీ. కడకు నిను దాసునిగఁ గొన్న కాటిఱేఁడు
పరయముఁడు గాని కడజాతి ♦ వాఁడు గాఁడు
ఇపుడు నీవు వసించెడు ♦ నిప్పొలంబు
సవనవాటంబు గాని మ ♦ సనమ్ము గాదు.

మఱియు, క. వనికత్తెగ నీ వనితం
గొనినాతఁడు బాలచంద్ర ♦ కోటీరుఁడు గా
క నిజముగా విప్రుడు గా,
డనఘా ! హరసేవ దొరకునా ♦ యన్యులకున్ ?

కావున మరల నీరాజ్యము నీవు గ్రహించి నన్నుఁ జరితార్థునిఁ జేయుము.

వసి—వత్సా ! ఈవిశ్వామిత్రుని ప్రార్థన మంగీకరింపుము.

హరి—గురూత్తమా ! ఇమ్మహనీయుఁడు నన్నుఁ బ్రార్థింపవలయునా ?

పర—విశ్వామిత్రా ! నీచేతితోఁ గిరీట మూతని శిరం బలంకరింపుము.

దేవేం—గాధేయా ! నాఁడు సకల మునిగణంబుల సమక్షమునఁ జేసిన ప్రతిజ్ఞం జెల్లించుట కిదియే యదను. కావున నీ పరమేశ్వరు నాజ్ఞ శిరసావహించి నిత్యసత్యవ్రతుండగు నీహరిశ్చంద్ర చక్రవర్తికి నీచేతులార పట్టాభిషిక్తుం జేసి నీతపశ్శక్తి యంతయు ధారపోయుము.

విశ్వా—(అట్లు చేసి) ఇదిగో నాతపశ్శక్తి యంతయు నీకే ధారవోయుచున్నాను. పరిగ్రహింపుము.

వసి—విశ్వామిత్రా ! ఇప్పటికై నా నెవరు గెల్చిరో చెప్పుము.

విశ్వా—చాలు చాలు. విశ్వామిత్రుఁడు నీ కోడెనని తలంచుచున్నావు కాంబోలు సాటిరాచబిడ్డయగు మాహరిశ్చంద్రుని సత్యయశంబుఁ బ్రకటింప నుద్దేశించి సఫలీకృతమనోరథుండనగు నాకుఁ బరాజయ మెక్కడిది ? ఇన్ని కష్టములం బడకున్న నితని కీర్తి లోకమున కెట్లు వెల్లడియగును ?

హరి — నిజము, ఇమ్మహనీయుని వచనంబులు యథార్థములు. చూడుఁడు.

గీ. కఱఁగినను గాని పసిడికిఁ ♦ గాంతి రాదు
దఱచినను గాని పాలఁ జే ♦ కురదు వెన్న
యొరచినను గాని మణికైన ♦ నొఱపు రాదు
ఇడుములను గాని నరున కే ♦ ర్పడదు కీర్తి.

దేవేం — విశ్వామిత్రా! నాఁడు నేను సభలో

గీ. సరసులగు పండితుల విమ ♦ ర్శనము లెల్ల
గడచినదె కద నిర్దుష్ట ♦ కావ్యమగును
తన కళత్ర సుత ప్రాణ ♦ ధనము లడఁగు
సమయమున నిల్చియున్నదే ♦ సత్యనిష్ఠ.

అని వక్కాణించిన దిందులకే.

పర — హరిశ్చంద్రా! నీకింకేమి కావలయును?

హరి — దేవా! నేనింకఁ గోరఁదగిన దేమున్నది?

మ. తనయుం డాత్తనయుండు దుర్విషలస ♦ ద్దర్వీకరగ్రస్తుఁడై
మనియెన్ జెట్టున కొక్క పక్షిగతి సం ♦ సారంబు నిర్భిన్నమై
చనినన్ జేరితి నాలుబిడ్డల నికృ ♦ ష్టంబైన దాస్యంబు వా
సె, ననిర్వాచ్యసుఖంబు దక్కె నశియిం ♦ చెన్ దుష్టనిందావళుల్.

అయిన దేవర ప్రసన్నం జెందిరి గాన నిట్లగుగాక!

మంగళ మహాశ్రీవృత్తము

శ్రీలొసఁగ ధారుణీ నశేషమగు పంటలు విశేషముగఁ బండెడి ధరిత్రీ
పాలకులు రాష్ట్రములుఁ బాడిమెయి నేలుదు గపారకరుణారససమృద్ధిన్
జాలగ వసుంధర నసత్యము నశించుతను సత్యమే జయంబు వహియించున్
శీలలితులైన కవిధీరుల యభీష్టముల దీర్చెదరుగాక నృపమౌళుల్.

పర — తథాస్తు. (అందఱు నిష్క్రమింతురు)

గద్య

ఇది హరితస గోత్రపవిత్ర నృసింహ మనీషి వరపుత్ర బుధజనవిధేయ
లక్ష్మీకాంత నామధేయ ప్రణీతంబైన శ్రీ సత్యహరి
శ్చంద్రీయ నాటకంబున సర్వంబును సంపూర్ణము

---

శ్రీ కొండపల్లి ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము.